## సదాశివ సమారంభాం








గురు దక్షిణామూర్తి

గురు వేదవ్యాస మహర్షి

గురు శుక మహర్షి

గురు నారద మహర్షి

గురు వాల్మీకి మహర్షి

గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం








గురు దత్తాత్రేయ

గురు బాబాజీ

గురు గౌతమ బుద్ధ

గురు ఆదిశంకరాచార్య

గురు రామానుజాచార్యులు

గురు జ్ఞానేశ్వర్









గురు రవిదాస్

గురు కబీర్ దాస్

గురు చైతన్య మహా ప్రభువు

గురు నానక్

గురు రాఘవేంద్ర స్వామి

గురు వీరబ్రహ్మేంద్ర స్వామి

యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం









గురు త్రైలింగ స్వామి

గురు లాహిరి మహాశయ

గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి

గురు వివేకానంద

గురు సాయి బాబా

గురు అరబిందో








గురు రమణ మహర్షి

గురు యోగానంద

గురు భక్తివేదాంత ప్రభుపాద

గురు మళయాళస్వామి

గురు విద్యాప్రకాశానందగిరి

గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100028529

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మధురభారతి

(ఆధ్యాత్మిక వ్యాస సంపుటి)



జంధ్యాల పరదేశిబాబు
ఎం.ఏ; ఎం.ఫిల్.

# మధురభారతి

(ఆధ్యాత్మిక వ్యాస సంపుటి)




జంధ్యాల వరదేశిబాబు

ఎం.ఏ; ఎం.ఫిల్.

# విషయసూచిక





# 1. నన్నయ భారతము - నీతిశాస్త్రము

రాజరాజనరేంద్రుని ఆస్థానకవి నన్నయభట్టు. వ్యాసమహర్షి సంస్కృతములో రచించిన మహాభారతమును రాజరాజనరేంద్రుని ఆదేశానుసారము ఆంధ్రభాషలోనికి అనువదించి నన్నయ ఆదికవి యైనాడు. నన్నయ కులబ్రాహ్మణుడు; అవిరళ జప హోమతత్పరుడు; విపులశబ్దశాసనుడు; సంహితాభ్యాసుడు; బ్రహ్మాండాది నానా పురాణవిజ్ఞాన నిరతుడు; ఆపస్తంభ సూత్రుడు; లోకజ్ఞుడు; ఉభయ భాషా కావ్యరచనా భిశోభితుడు; సత్ప్రతిభాభియోగ్యుడు; నిత్యసత్య వచనుడు.

నన్నయ విశ్వశ్రేయస్సు నాకాంక్షించి భారతాంధ్రీకరణము కావించుట తెలుగువారి పుణ్య విశేషము. నన్నయ భారతమందు ఆది, సభాపర్వములు, అరణ్యపర్వములో కొంతభాగమును ప్రసన్న కథాకలితార్థ యుక్తితోను, అక్షరరమ్యతతోను, నానారుచిరార్థ సూక్తుల తోను రచించి, ఆంధ్ర భాషా సరస్వతికి అలంకారముగా సమర్పించిన మహనీయుడు. జగద్ధితమే పరమ ప్రయోజనముగా భావించి వైదిక మతోద్ధరణ కొరకై పరమ రమణీయముగను, ప్రతిపద్య హృద్యము గను భారతమును నన్నయభట్టు రచించినాడు :

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
　　యధ్యాత్మ విదులు వేదాంతమనియు
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని
　　కవి వృషభులు మహాకావ్యమనియు

లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియు
బరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
యంబని మహి గొనియాడు చుండ

వివిధ వేద తత్త్వవేది వేదవ్యాసు
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండ జేసె భారతంబు *(ఆది. 1 ఆ. 31 ప.)*

భారతము ధర్మశాస్త్రము; వేదాంత గ్రంథము, నీతిశాస్త్రము; మహాకావ్యము; మహేతిహాసము; పురాణ సముచ్చయము; సకల పురుషార్థసారము. సంస్కృతాంధ్ర భారతములకు సమన్వయించు విషయములివి.

భారతములో రాజవంశ చరిత్ర అత్యధికముగా అభివర్ణింపబడినది. అందువలన రాజనీతి విశేషములు, ధర్మసూక్ష్మములు మనోహరముగా ప్రతిపాదింపబడినవి.

## యయాతి బోధించిన రాజనీతి :

నన్నయ ఆంధ్ర మహాభారతము ఆదిపర్వము తృతీయాశ్వాసమందు, యయాతిచేత పూరునకు అనేక రాజనీతి ధర్మములను బోధింపజేసినాడు.

రాజర్షియైన యయాతి బ్రహ్మర్షి గణ పూజితుడు; తండ్రికి తగిన తనయుడు పూరుడు. తన యౌవనమును తండ్రికిచ్చి, తండ్రి ముసలి తనమును తాను స్వీకరించిన పితృభక్తి తత్పరుడు పూరుడు.

తల్లిదండ్రుల కానందమును కలిగించుటచే పూరుడు చిన్నకుమారు డైనను రాజ్యార్హతను పొందెను. యయాతి పూరునకు రాజనీతి ధర్మములను ప్రబోధించినాడు.

*ఎఱుకగలవారి చరితలు,*
*గఱచుచు సజ్జనుల గోష్ఠి గదలక ధర్మం*
*బెఱుగుచు నెఱిగిన దానిని*
*మఱవ కనుష్ఠించునది సమంజసబుద్ధిన్* **(ఆది. 3 ఆ. 203 ప.)**

*ఇచ్చునది ధనము పాత్రున*
*కచ్చుగ నొరు వేడకుండునది యభిముఖులై*
*వచ్చిన యాశార్థుల వృథ*
*పుచ్చక చేయునది సర్వభూతప్రీతిన్* **(ఆది. 3 ఆ. 204 ప.)**

*మనమునకు బ్రియంబును హిత*
*మును బథ్యము దథ్యమును నమోఘము మధురం*
*బును బరిమితమును నగు పలు*
*కొనరగ బలుకునది ధర్మయుతముగ సభలన్*
**(ఆది. 3 ఆ. 205 ప.)**

"తన శరీరములోని సర్వేంద్రియములు, సమస్తాణువులు అతని పొందుకొరకు తహతహలాడుచున్నవని తడబాటులేని మాటలలో తేటపరచింది"అని ఆచార్య సి. నారాయణరెడ్డిగారి వ్యాఖ్య.

ప్రభువైనవాడు ఎల్లప్పుడు ధర్మ రహస్యములను, ఎఱుకగల వారి చరితలు గ్రహించుచు, నిరంతరము సజ్జనుల గోష్ఠి సల్పుచు, ధర్మానుష్ఠానము చేయవలెను. అర్హుడైనవానికి మాత్రమే ధనమును దానము గావింపవలెను. రాజు మితముగను, హితముగను, సత్యము

గను, తగినదిగను, ప్రియముగను మాట్లాడవలెను. రాజు మనస్సు నందు కరుణ, ఋజు ప్రవర్తన, సత్యము, శమము, శౌచము అను గుణగణములు నిలుపవలెను. అరిషడ్వర్గములైన కామక్రోధాదులను ప్రభువు జయింప వలెను.

మదము గామంబు గ్రోధంబు మత్సరంబు
లోభమును మోహమును నను లోనిన
వైరి వర్గంబు నొడిచినవాడ యొడుచు
నశ్రమంబున వెలుపలి యహిత తతుల. (అది. 3 ఆ. 206 ప.)

ఏవం విధమైన రాజనీతి ధర్మములను యయాతి తన పుత్రుడైన పూరున కుపదేశించెను.

ఈ సందర్భమందు రాజధర్మములను గురించి శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారు చెప్పిన పలుకులు ఎంతయో ఉదాత్తముగా నున్నవి :

"ధర్మమెట్లు చెప్పునో అట్లే ప్రవర్తింపుము. ప్రియా ప్రియ భావన వ్యక్తిగత మనో వికారములు వీనిని జయించి ప్రాణి మాత్రమందు సమభావముతో మెలగవలెను. కామక్రోధాదులను జయించి ప్రజా రక్షణ మొనర్చుటయే నీ కర్తవ్యము. శాశ్వతమైన ధర్మమే నీకు రక్ష. కర్తవ్యము నుండి తొలగినవానిని ఎవ్వనినైనను నీ బాహుబలముతో నిగ్రహింప వలయును. త్రికరణ శుద్ధిగ నీ భూమండలమును బ్రహ్మస్వరూపముగదలచి దానికి సేవ యొనర్తునని ప్రతిన సేయుము. దండనీతి ఆశ్రయించి విశ్వధర్మమును నిశ్శంకముగ గొలువుము". *(మహాభారత విమర్శనము - 63 పు.)*

"నా విష్ణుః పృథివీపతిః" అని గదా! రాజును ప్రజలు సాక్షాత్తు దైవముగా పూజింపవలెను.

## కణిక నీతి :

కణికుడు దుర్యోధనునకు రాజనీతిని బోధించినాడు. దీనిని ఆపద్ధర్మనీతి లేక కూటరాజనీతిగ భావింపవచ్చును. విశ్వకల్యాణము కొరకై ప్రభువు కూటరాజనీతిని అపద్ధర్మముగ అవలంబించును.

ప్రభువు ఆత్మరక్షణమునందు నిత్యజాగరూకుడై యుండవలెను. రాజు తన పదవిని కాపాడుకొనుటకై 'వీరిని నమ్మవచ్చును, వీరిని నమ్మకూడదు' అని మనస్సునందు తలంపరాదు. రాజు దండమును ధరించి సమస్త ప్రజలను తమ తమ ధర్మములను నిర్వర్తింప చేయుటకు సాధనముగా నుపయోగింపవలెను. దండభీతిచే ప్రజలు తమతమ పనులను సక్రమముగా చేయుదురు. రాజు మృదు కర్మముచేగాని క్రూరకర్మముచేగాని నిజధర్మమును నిర్వహింపవలెను.

*ధరణీశుడుద్యత దండుడై యుచిత దండ విధానంబు దప్పక ధర్మ*
*చరితులగా మహీజనుల రక్షించి, సద్వృత్తుడగునది సర్వవర్ణములు వరుసన*
*తమతమ వర్ణధర్మముల వర్తిల్లుదురు గడవక దండనీతి*
*నరిమిత్ర వర్జితుడై సమబుద్ధియగు మహీవల్లభు ననుశాసనమున.*

*(ఆది. 6 ఆ. 101 ప.)*

*జనపాలుడు మృదు కర్మం*
*బున నైనను గ్రూర కర్మముననైనను నే*
*ర్పున నుద్ధరించునది ద*
*న్న నపాయత బొంది చేయునది ధర్మంబుల్*

*(ఆది. 6 ఆ. 104 ప.)*

రాజు తన లోపములు తానెఱిగి, ఇతరుల లోపములను గుర్తించి, దేశ కాలములకు తగినట్లు మిత్ర సంపన్నుడై మెలగవలెను.

ప్రభువు అనునిత్యము అలయక ఆత్మకృత్యము తెలిసికొని, పరుల కృత్యములను దూతవలన గ్రహించవలెను. దుష్టజనులను దూర ముగా నుంచుట ప్రభువు కర్తవ్యము. తనకు అపకారము చేసినవానిని అల్పునిగా తలంచి, వానిని దూరముగా నుంచుట రాజధర్మము. శత్రువు అల్పుడని ఉదాసీనత వహించుట తగదు. శత్రు నిర్మూలనము ప్రభువు ప్రథమ కర్తవ్యము.

పలు మఱు శపథంబులు నం
జలియును నభివాదనమును సామప్రియ భా
షలు మిథ్యా వినయంబులు
గలయవి దుష్ట స్వభావకాపురుషులకున్. (ఆది. 6 ఆ. 111 ప.)

పలుమార్లు శపథములు పలికియు, అంజలి ఘటించియు, అభివాదములు చేసియు, సామప్రియ భాషలు మాట్లాడియు, మిథ్యా వినయము నటించు దుష్టులైన పురుషులు రాజును తమ కైవసము చేసికొనుటకు ఎల్లప్పుడు ప్రయత్నించెదరు. అట్టి కాపురుషులయెడ ప్రభువు జాగరూకుడై యుండవలయును.

తడయక సామభేదముల దానములన్ దయతోడ నమ్మగా
నొడివియు సత్యమిచ్చియు జనున్ జననాథకృతాప కారులం
గడగి వధింపగా ననుట కావ్యమతంబిది గాన యెట్టులుం
గడుకొని శత్రులం జెఱుప గాంచుట కార్యము రాజనీతిమైన్.
(ఆది. 6 ఆ. 118 ప.)

శత్రు నిర్మూలనము విషయమున రాజు అప్రమత్తుడై యుండ వలెను. ఆత్మరక్షణము కొరకు ప్రభువు శత్రు నిర్మూలనము చేయ వలెను.

## గృహస్థనీతి :

చతుర్విధ ఆశ్రమములందు గృహస్థాశ్రమమునకు అత్యంత ప్రముఖ స్థానము కలదు. గృహస్థుడు తన గృహిణి వలననే ధర్మార్థ కామ మోక్షములు పొందగలడు.

శకుంతల దుష్యంత మహారాజు సభలో గృహస్థాశ్రమ ప్రాముఖ్యమును వివరించిన తీరు పరమ రమణీయమై వర్తిల్లినది. నన్నయ భట్టారకుని మహనీయ ధర్మ ప్రబోధమునకు మకుటాయ మానమై విరాజిల్లినది.

ధర్మార్థ కామ సాధన కుపకరణంబు
గృహనీతి విద్యకు గృహము విమల
చారిత్ర శిక్ష కాచార్యకం బన్వయ
స్థితికి మూలంబు సద్గతికి నూత
గౌరవంబున కేక కారణం బున్నత
స్థిర గుణమణుల కాకరము హృదయ
సంతోషమునకు సంజనకంబు భార్యయ
చూవె భర్తకు నొండ్లు గావు ప్రియము
లెట్టి ఘట్టములను నెట్టి యాపదలను
నెట్టి తీఱములను ముట్టబడిన
వంతలెల్ల బాయు నింతుల ప్రజలను
నొనర జూడగనిన జనులకెందు

*(ఆది. 4 ఆ. 84 ప.)*

మానవుడు మోక్షమును పొందుటకు సంసారమును త్యాగము చేయవలసిన అవసరము లేదనియు, గృహస్థాశ్రమములో నుండియే ముక్తిని సాధింపవచ్చుననియు, నన్నయ గృహస్థనీతిని, భార్యా ప్రాశస్త్య మును వివరించియున్నాడు.

అనంతరము శకుంతల సత్య ప్రాశస్త్యము నుగ్గడించినది.

నుతజల పూరితంబులగు నూతులు నూఱిటికంటె సూనృత
వ్రత యొకబావిమేలు, మఱిబావులు నూఱిటికంటె నొక్క స
త్క్రతువదిమేలు, తత్క్రతు శతంబునకంటె సుతుండు మేలు, త
త్సుత శతకంబుకంటె నొక సూనృత వాక్యము మేలు సూడగన్

(ఆది. 4 ఆ. 94 ప.)

వెలయంగ నశ్వమేధం
బులు వేయును నొక్క సత్యమును నిరుగడలం
దుల నిడి తూపగ సత్యము
వలన ములు సూపు గౌరవంబున పేర్మిన్ (ఆది. 4 ఆ. 95 ప.)

సర్వతీర్థాభి గమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుగావు;
ఎఱుగు మెల్ల ధర్మంబుల కెందు పెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు (ఆది. 4 ఆ. 96 ప.)

నూఱుగురు పుత్రుల కంటెను, వేయి అశ్వమేధ యాగముల కంటెను సత్యమే శ్రేష్ఠమైనది - సకల ధర్మములందు సత్యమే గొప్పది.

ఈ విధముగా నన్నయ తన భారత భాగమునందు రాజనీతి విశేషములను, గృహస్థనీతి ధర్మములను, దండనీతి ధర్మములను పెక్కింటిని ఉపదేశించినాడు.

"భారతము సర్వవేద సారభూతమైన సత్యమును ప్రతిపాదించు పంచమ వేదము. ఉపనిషదుప బృంహితమైన ధర్మసామస్త్యమునకు నిధియు, నిక్షేపమునునైన భగవద్గీతకు కాణయాచి. ప్రాచీన విజ్ఞానసర్వస్వము. భారతీయ సంస్కృతీ భాండాగారము. సర్వమానవజాతికి సముపాదేయమైన సార్వకాలికము, సార్వదేశికమునైన ఔపదేశిక ప్రతిపత్తి కదియొక నిక్షేపము" అను ఆచార్య యస్వీ. జోగారావుగారి వాక్కులు వాస్తవములు. (ఆంధ్ర మహాభారతము-ఔపదేశిక ప్రతిపత్తి)



# ౨. ధర్మవ్యాధోపాఖ్యానము - ఎఱ్ఱన సందేశము

వ్యాసుడు సంస్కృతములో రచించిన మహాభారతమును తెలుగు వారికందించిన మహనీయులలో మూడవవాడు ఎఱ్ఱన. తెలుగులో పద్యరచనకు ప్రాణము పోసిన నన్నయ కవితా మార్గమును, తెనుగు నుడికారపు సొంపుతో భారత రచన గావించిన తిక్కన కవితా ధోరణిని, ఆపోశనము పట్టిన మహాకవి ఎఱ్ఱన. వర్ణనాత్మకమైన శైలిలో ఆంధ్ర మహాభారత అరణ్యపర్వ శేషమును పూరించి, తెలుగు కవితను సుమసౌరభాలతో నింపిన కవిత్రయ కవులలో తృతీయుడు- కవితా శిల్పమున అద్వితీయుడు ఎఱ్ఱన.

ఆంధ్ర మహాభారతమున గల అరణ్య పర్వమునందలి పంచమాశ్వాసములోని "ధర్మవ్యాధోపాఖ్యానము" ద్వారా ఎఱ్ఱన ఉత్తమ పుత్రలక్షణమును, పతివ్రతామతల్లి మాహాత్మ్యమును, అహింసా స్వరూపమును, పెక్కు శిష్టాచారములను పరమాద్భుతముగా తెలిపినాడు. భగవద్గీతను శ్రీకృష్ణ పరమాత్మ నిష్కామ కర్మయోగియగు ధర్మవీరుడైన అర్జుననకు ఉపదేశింపగ, ధర్మవ్యాధోపాఖ్యానములో ఒక కిరాతకుడు బ్రాహ్మణునకు పరబ్రహ్మ ప్రాప్తిపొందు మార్గమును ప్రబోధించినాడు.

ఒకనొక పతివ్రత పంపగా తనవద్దకు వచ్చిన కౌశికుడను బ్రాహ్మణునకు ధర్మవ్యాధుడు ధర్మసూక్ష్మములను, అహింసా

2

తత్త్వమును, తల్లిదండ్రులకు చేయవలసిన సేవలను, కర్మఫలమును రమణీయముగా వివరించుట "ధర్మవ్యాధుని కథ"లోని విశేషము.

సత్య హితాలాప చతురులు, సంతత సుజన పూజకులు, కామ సంరంభ విద్వేషము లేనివారు - ధర్మ పథానువర్తులు, ప్రియా ప్రియము లందు, దైన్య హర్షములందు సమచిత్తులు ఉత్తమ పురుషులుగా పరిగణింపబడుదురు.

*పాపములకెల్ల నెక్కుడు పాతకములు,*
*సువ్వె క్రోధ లోభంబులు సువ్రతాత్మ!*
*వాని రెంటి జయించినవాడు గాని,*
*యెందు పరమ ధార్మికుడని యెన్నబడడు.* *(అరణ్య5 ఆ.42 ప.)*

క్రోధమెట్లు నరక హేతువగునో భగవద్గీతలో చెప్పబడినది.

"త్రివిధం నరకం స్యేదం ద్వారం నాశన మాత్మనః". కావుననే మానవుడు క్రోధలోభములను జయింపవలెనని ధర్మవ్యాధుని ప్రబోధము.

శిష్ట చరితములుగాని మార్గములు గడ్డిచే కప్పబడిన నూతుల వలె అధర్మముతో కూడియుండును. వానిని దూరముగ నుండగనే పరిత్యజించి శిష్టాచారముల ననుసరించుట ధర్మలక్షణము.

[illegible] సత్యంబు తపము యజ్ఞము నార్జ
[illegible] కామ లోభాది వర్జనంబు,
గురు [illegible] శుశ్రూష క్రోధ రాహిత్యంబు,
దమము సంతోష మధ్యయన నిరతి
దాంభికత్వములేమి దైన్యంబు వొరయమి,
యనసూయ యనహంక్రియాభియుక్తి

దలపంగ నాద్యమై తనరు ధర్మమ యెప్డ
గొనియాట నాస్తిక గోష్ఠి జనమి
శీల సంరక్ష తీర్థ సంసేవ శౌచ
మఖిల భూతంబులందు దయార్ద్రుడగుట
మితహితోక్తులు సంశ్రిత మిత్ర గుప్తి,
యిన్నియును శిష్ట చరితంబు లిద్ధచరిత.(అరణ్య. 5 ఆ. 44 ప.)

దానము, సత్యము, తపము, యజ్ఞము, ఆర్జవము, కామ లోభాది వర్జనము, గురుజన శుశ్రూష, అక్రోధము, అధ్యయన నిరతి, దంభదైన్యములను విడుచుట, శీలరక్షణము, తీర్థసేవ, శౌచము, భూతదయ కలవారు శిష్టులని తాత్పర్యము. ధర్మములు మూడు విధములు : 1. వేద విహితములు, 2. శాస్త్ర విహితములు, 3. శిష్ట చరితములు. ఇవి అన్నియు సద్గతికి కారణములని ధర్మవ్యాధుని ఉపదేశము.

"అహింసా పరమోధర్మః"-సమస్త ధర్మములలో ఉత్తమమైనది అహింస. ఇది హింస, ఇది అహింస అని నిర్ణయించి చెప్పుట కడుంగడు కష్టము. జీవులు, చేసిన కర్మానుగుణముగ నశించు చున్నవి. బ్రహ్మ పశు, మృగ, పక్ష్యాదులకు ఆహారముగ మాంసమును, మానవులకు పండ్లు, ఓషధులను సృష్టించెను. మునీశ్వరులు పితృ దైవత కార్యములందు మాంసమిడుట ధర్మమని ఉద్ఘోషించు చున్నారు-అది హింసయనుట తగదు. ప్రతి జీవియు ఏదోవిధముగ జీవహింస చేయుచునే యున్నది. వ్యవసాయదారుడు నాగలిపట్టి భూమిని దున్నునపుడు వానపాములవంటి ప్రాణులెన్నెన్నో చనిపోవు

చున్నవి. అది అహింసయందుమా? మానవుడు నేలపై నడుచు నపుడు, ఆతని కాళ్ళక్రిందపడి అనేక ప్రాణులు చచ్చుచున్నవి. అహింసా వ్రతముగాగల మునులు కూడా చెట్ల ఆకులు, పండ్లు, కూరలు తినుచున్నారు-ఇది చెట్లకు హింసయేగదా! కావున తమ తమ పద్ధతులలో జీవులు హింసామార్గమునకు దూరముగా బ్రతుకు టయే మేలు-అదియే అహింస. ఈ విధముగా అహింసా తత్త్వమును ధర్మవ్యాధుడు కౌశికునకు వివరించాడు.

*హింస సేయనివాడు లే డిజ్జగమున,*
*నొక్కడైనను తమ తమ యోపినట్లు*
*హింస తెరువున కెడగల్గి యేగవలయు,*
*నదియె చూవె యహింసనా నతిశయిల్లు* (అరణ్య. 5 ఆ. 60 ప.)

లోకములో చూచినది చూచినట్లు చెప్పుట సత్యమని వ్యవహా రములో గలదు. సత్య స్వరూపమును ఎఱ్ఱన తన భారతములో నిట్లు చెప్పినాడు.

*భూతహితంబుగా బలుకు బొంకును సత్యఫలంబునిచ్చు, త*
*ద్భూత భయాస్పదంబగు ప్రభూతపు సత్యము బొంకునట్ల, ప్రా*
*ణాతురుడైనచో పరిణయంబున యందును పల్కుబొంకు స*
*త్యాతి శయంబ యండ్రు మహితాత్మక యిట్టివి ధర్మసూక్ష్మముల్*
(అరణ్య. 5 ఆ. 62 ప.)

ప్రాణుల క్షేమముకోరి పలికెడు అబద్ధము కూడ సత్యవాక్య ఫలమునే యిచ్చును. ప్రాణులకు భీతిని కలిగించు సత్యముకూడ అబద్ధపు ఫలమునే యిచ్చును. మరణకాలమునను, పెండ్లి సమ యములోను పలుకు అసత్యము-సత్యముకన్న మిన్నయై వరలును.

ప్రాణులు తమ గత జన్మలలో చేసిన పనుల ఫలితములను ఆ జన్మలలోనే అనుభవించును. అట్లు కానిచో ఆ ఫలమును మరుజన్మలో తప్పక అనుభవించును. ఈ సత్యమును తెలిసికొనలేని మూఢులు, తమకు ఈ జన్మలో కల్గిన అపకారములకు భగవంతుని నిందించెదరు. కానీ వారివారి పాప పుణ్యఫలములే వారి ఆపదలకు మూలకారణమని వారు గ్రహించరు. కొందరికి కోరకయే సంపదలు కలుగును-కొందరు ఎంత శ్రమించినను వారి శ్రమ వ్యర్థమగును. కొందరికి బిడ్డలు పుట్టుదురు- కొందరికి పుట్టరు. వీటి అన్నింటికి కారణము కర్మఫలమే.

*కర్మవశత చూవె కలుగు దేహము, దేహ*
*వర్తనంబు కర్మవశత బుట్టు,*
*దేహ పాతమైన దేహస్థుడగు జీవు*
*డరుగు కర్మ విహితమైన యెడకు* (అరణ్య 5 ఆ. 70 ప.)

పురుషుడు కర్మాధీనుడు కాకపోయినచో ఆపదలు, రోగములు, మరణములు కలుగకుండ జీవించగలడా? కర్మవశత దేహము కలుగును. దేహవర్తనము కర్మవశత పుట్టును. దేహపాతమైనచో దేహస్థుడైన జీవుడు కర్మవిహితమైన స్థానము పొందును.

జీవుడు సనాతనుడు, అనఘుడు. శరీరము నాశము పొందినను జీవునకు నాశములేదు. భగవద్గీతలో ఆత్మ నిత్యమనియు నిర్గుణమనియు, నిరంజనమనియు, అవ్యయమనియు తెలుపబడినది. జీవుడు కర్మవశుడై శరీరమును పొందును. జీవుడు కావించు పుణ్య పాపములచే జనన మరణ పరంపర పొందును. స్థిరమైన పుణ్యకర్మమున దేవత్వమును, పుణ్యపాప సంకరమున మానుషత్వమును, కల్మషముచే పశుపక్ష్యాదుల భావమును పొందుచున్నాడు.

ఆకాశము, వాయువు, అగ్ని, నీరు, భూమి అను పంచభూతము లకు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను గుణములు

గలవు. ధీరుడు శబ్దాది విషయములందు ప్రసరించు ఇంద్రియము లను కుదియించి, తన యందున్న పరతత్త్వము కాంచి, నిర్మల తపశ్చర్య మగ్నుడగును. ఇంద్రియ నిరోధము స్వర్గ ప్రదము-ఇంద్రియ చరణము నరక ప్రదము. తపస్సు అనగా-సకల విషయ వ్యపేతమైన బుద్ధివైభవము. పరమ ధీరుడు శరీరమను రథమును ఎట్లు స్వాధీనము చేసికొనవలెనో ధర్మవ్యాధుడు కౌశికునకు తెలిపెను.

ధర్మవ్యాధుడు తల్లిదండ్రులకు సేవ కావించుటవలన కలుగు ఫలమును చక్కగా కౌశికునకు వివరించినాడు. "ఈ వృద్ధులు నాపాలి వేల్పులు-వీరికెపుడు కమనీయ ఫల పుష్పగంధ భూషణ వస్త్రములు, మనోహర భక్ష్య భోజ్యములను నివేదింతును. వేదములు, యజ్ఞ ములు, వ్రతములు అన్నియు నాకు వీరే.

*జనని జనకుడు సద్గురు డనలు డాత్మ*
*డనగ నియ్యేవరును నే గృహస్థుచేత*
*సుగతి వాంఛ ప్రసాదితులగుదు రట్టి*
*వాడ చూవె ధర్మాత్ముండు వసుధమీద"*(అరణ్య.5 ఆ.118 ప.)

ధర్మవ్యాధుడు తన కులవృత్తియైన మాంస విక్రయము కావించుచు, ప్రాణహింసచేయక, తల్లిదండ్రులను సేవించుచు పరమ జ్ఞానియై వేదాచారపరులైన వారికి కూడ జ్ఞానబోధ కావించినాడు. ఈ విధముగా "ధర్మవ్యాధుని కథ"వలన ఎఱ్ఱన పెక్కు ధర్మ సూక్ష్మములను, సూక్తులను, సమస్త మానవాళి కందించినాడు.

సాహిత్యము ధర్మప్రబోధమునకు మంచి సాధనము. అతి ప్రాచీన కాలము నుండి కవులు సాహిత్యము ద్వారా ధర్మతత్త్వ విశేషములను ప్రజలకందించి ధన్యులైరి. అట్లే నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలు వ్యాస ప్రణీత పరమార్థమును తెలుగు ప్రజకు తెల్లము కావించిన అబ్జాసనకల్పులు. విశ్వశ్రేయమే కవిత్రయ కవుల భారతాంధ్రీ కరణము. తెలుగు ప్రజల పుణ్య పరిపాకము కవిత్రయ భారతము.

భారతము సర్వధర్మసారము; భారతము ధర్మశాస్త్రము; భారతములో ధర్మశాస్త్ర లక్షణములన్నియు సర్వాంగ సుందరముగ చెప్పబడినవి.



# 3. రుక్మిణీ కల్యాణము - దేవీ తత్త్వము

"భగవత్తత్త్వమును వివరించునది భాగవతము. సంసార భయమును తొలగించి, అజ్ఞానాంధకారమును పోగొట్టునది భాగవతము" అని స్కాంద, పద్మ పురాణాదులలో భాగవత ప్రాశస్త్యము చెప్పబడినది. భగవంతుని గురించి, భగవద్భక్తులను గురించి చెప్పునది భాగవతము. శ్రీమన్నారాయణుని ఏకవింశతి అవతారములను గురించి, ముఖ్యముగా శ్రీకృష్ణుని అవతారవిశేషములను అద్వితీయముగను, అత్యంత హృదయంగమముగను భాగవతమందు అభివర్ణింపబడినవి.

భారతీయుల ఆధ్యాత్మిక సంపదకు ప్రతిబింబమైన వ్యాస భాగవతమును ఆంధ్రీకరించుటలో పోతనామాత్యుని భక్త్యావేశము, కవితామాధుర్యములు పరాకాష్ఠనందినవి. "భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు శూలికైన-తమ్మిచూలికైన"అనియు, "శ్రీ కైవల్య పదంబు చేరుటకునై చింతించెదన్"అనియు భావించిన పోతన, "పునర్జన్మంబు లేకుండుటకునై" భాగవతము నాంధ్రీకరించి, తెలుగు ప్రజలకు మహోపకారము కావించినాడు.

ద్వాదశ స్కంధ పరిమితమైన భాగవతములో దశమస్కంధము ఆత్మస్థానమని విజ్ఞుల అభిప్రాయము. రామాయణములో సుందర కాండకెంతటి ప్రాముఖ్యమున్నదో, భాగవతమందు దశమస్కంధమున కంతటిప్రాశస్త్యమున్నది. భాగవతమందు ప్రధానముగా విష్ణుభక్తి తత్త్వము ప్రతిపాదింపబడినప్పటికి, అయా సన్నివేశములలో "దేవీ తత్త్వము"ను ఆవిష్కరింపబడినది.

పోతన "నిరంతర మహేశ్వర ధ్యాన తత్పరుడు"; "పరమేశ్వర కరుణా కలిక కవితా విచిత్రులు"; "చేతులారంగ శివుని పూజింపడేని,

నోరు నొవ్వంగ హరి కీర్తి నుడువడేని''అని పోతన హరిహరుల అభేదమును చాటిచెప్పిన మహనీయుడు.

"అమ్మలగన్న యమ్మ, ముగురమ్మల మూలపుటమ్మ, చాల పె
ద్దమ్మ, సురారులమ్మ కడుపాఱడి వుచ్చినయమ్మ, తన్నులో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి యమ్మ, దుర్గ మా
యమ్మ, కృపాబ్ధి యిచ్చుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్"

(ప్ర. స్కం. 8 ప.)

పఠితలను మైమరపించు అనుప్రాసలు, తేట తెలుగు మాటలు, దీర్ఘ సంస్కృత సమాసములు మందార మకరంద ప్రవాహమువలె పోతన కవితలో కమనీయ కాంతులనీనుచుండును.

అమ్మలందరికి అమ్మ దుర్గమ్మ; త్రిమూర్తులకు మూలమైన శక్తులు-లక్ష్మి, సరస్వతి, పార్వతి. ఈ ముగ్గురమ్మలకు మూలమైన తల్లి దుర్గాదేవి; ఆమె ఆద్యంతములు లేని కాల స్వరూపమంత పెద్దది; ఆమెను వర్ణించుటకు ఏ శబ్దశక్తి చాలదు; ఆమె రాక్షస సంహారము గావించి, దైత్యుల తల్లికి గర్భశోకము కలిగించిన పరాశక్తి; నమ్మినవారి మనస్సులలో నివసించెడి చల్లని తల్లి ఆమె; దయా సముద్రురాలు- తనకు మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదలు ప్రసాదించవలెనని పోతన భాగవత రచనారంభములో 'దుర్గాదేవి'ని ప్రార్థించినాడు.

భాగవత దశమస్కంధమందలి "రుక్మిణీ కల్యాణ"ఘట్టమందు పోతన''దేవీతత్త్వము''నెట్లు ఆవిష్కరించెనో వివరించుట ఈవ్యాస ప్రధానోద్దేశ్యము.

ఈ ప్రపంచమెల్ల నే మాయచే మోహి
తాత్మమగుచు నుండునట్టి మాయ
కమలనాభు నాజ్ఞ కార్యార్థమై నిజాం
శంబుతోడ పుట్టు జగతియందు

(ద. స్కం. 17 ప.)

ఈ ప్రపంచమంతయు ఏ మాయచేత మోహము చెందు చుండునో, అట్టి యోగమాయ శ్రీమహావిష్ణువు ఆదేశానుసారము తన అంశతో ధర్మకార్యనిర్వహణ కొఱకు భూలోకమునకు వచ్చి, శ్రీకృష్ణుని అవతారమునకు కారణమగును.

*నానావిధ సంపదలకు*
*తానకమై, సర్వకామదాయినివగు నిన్*
*మానవులు భక్తి కొలుతురు*
*కానికలును బలులునిచ్చి కల్యాణమయీ!* (దశమ స్కం.-60 ప.)

మానవుల సర్వసంపదలకు మూలమైనది ఆ దేవి; ఆమె 'కల్యాణ మయి'; సకల ప్రజల సమస్తమైన కోరికలను తీర్చునది ఆ దేవి. ఆమె సంకల్ప మాత్రముచేతనే యీ సకల సృష్టి జరుగుచున్నది; ఆమె సృష్టి స్థితి లయములకు హేతువైనది. అటువంటి ఆ దేవి దేశమందలి వివిధ ప్రాంతములలో దుర్గ, భద్రకాళి, విజయ, వైష్ణవి, కుముద, చండిక, కృష్ణ, మాధవి, కన్యక, మాయ, నారాయణి, ఈశాన, శారద, అంబిక-అను వివిధములైన పేర్లతో ఆరాధింపబడుచున్నది.

(దశమ స్కం. 61 వ.)

ఆ దేవి సకల'మంగళస్వరూపిణి', ఆమె సర్వ 'కామ ప్రదాయిని'. ఆ''దేవీ తత్త్వము''ను 'రుక్మిణీ కల్యాణ' ఘట్టమాధార ముగా వివరింపబడును.

*"కల్యాణాత్మకమైన విష్ణుకథ లాకర్ణించుచున్ ముక్తవై*
*కల్యుండెవ్వడు తృప్తుడౌ? నవి వినంగా గ్రొత్తలౌచుండు; సా*
*కల్యం బేర్పడ భూసురోత్తమ! యెఱుంగం బల్కవే రుక్మిణీ*
*కల్యాణంబు వినంగ నాకు మదిలో గౌతూహలంబయ్యెడిన్"*

(ద. స్కం. 1683 ప.)

అని పరీక్షిన్మహారాజు శుకమహర్షిని 'రుక్మిణీ కల్యాణ' కథను వినిపింపుమని కోరినాడు.

విదర్భదేశములో కుండిన నగరమునకు భీష్మకుడు ప్రభువు. ఆయనకు రుక్మి, రుక్మరథుడు, రుక్మబాహువు, రుక్మకేశుడు, రుక్మనేత్రుడు-అను ఐదుగురు కుమారులును, రుక్మిణియను కుమార్తెగలరు. రుక్మిణి యెలప్రాయమున తన తండ్రి ఇంటికి వచ్చెడి అతిథులవలన శ్రీకృష్ణుని రూపబల గుణాదులు విని, తనకతడే తగిన విభుడని తలచినది. ఆ హరియు కన్యామణియైన రుక్మిణి రూప వివేక శీలములు తెలిసికొని "తగన్ బాలా రత్నము తనకిల్లాలుగ చేకొందుననుచు" తలచినాడు. శేముషీసింధువులైన బంధువు లందరును కృష్ణునకు రుక్మిణినిచ్చి పెండ్లిచేయవలెనని భావించిరి. కానీ రుక్మిణి అన్నయగు రుక్మి దుష్టుడై, తన చెల్లెలిని చేది దేశాధిపతి శిశుపాలునకు కట్టబెట్టవలెనని సంకల్పించినాడు.

ఆ సమయమున రుక్మిణి తన మేలుగోరు అగ్నిద్యోతనుడను బ్రాహ్మణుని పిలిచి, శ్రీకృష్ణునివద్దకు ప్రణయ సందేశమిచ్చి పంపును.

*ఏనీ గుణములు కర్ణేంద్రియంబులు సోక*
*దేహతాపంబులు దీఱిపోవు,*
*నేనీ శుభాకార మీక్షింప గన్నుల*
*కఖిలార్థ లాభంబు గలుగుచుండు,*
*నేనీ చరణ సేవ లే ప్రొద్దు జేసిన*
*భువనోన్న తత్వంబు బొందగలుగు,*
*నేనీ లసన్నామ మే ప్రొద్దు భక్తితో*
*దడవిన బంధ సంతతులు వాయు*
*నట్టి నీయందు నా చిత్త మనవరతము*
*నచ్చియున్నది నీయాన నానలేదు,*
*కరుణ జూడుము కంసారి! ఖల విదారి!*
*శ్రీయుతాకార! మానినీ చిత్తచోర!* (ద. స్కం. 1701 ప.)

రుక్మిణి పంపిన పరిణయ సందేశములోని మొదటి పద్యమిది. కృష్ణుడు ఆ బాలామణి దృష్టికి కేవలము కంసారి, ఖలవిదారి మాత్రమే కాదు, శ్రీయుతాకారుడు, మానినీ చిత్త చోరుడును.

"శ్రీకృష్ణా! ప్రశస్తములైన నీ గుణములు చెవులబడినచో శరీర తాపములన్నియు శమించును. మంగళకరమైన నీ రూపము తిలకించి నచో కన్నులకు సమస్త ప్రయోజనములు సిద్ధించును. నిరంతరము నీ పాదసేవచేసినచో లోకములో మహోన్నతి పొంద వచ్చును. నీ దివ్యనామము స్మరించినచో బంధములన్నియు పటాపంచలగును. నా మనస్సు నీయందు లగ్నమైనది. నన్ను కరుణతో కటాక్షించుము''అని శ్రీకృష్ణుని మహోన్నతమైన గుణగణములను రుక్మిణి ప్రస్తుతించినది.

"తన శరీరములోని సర్వేంద్రియములు, సమస్తాణువులు అతని పొందుకొరకు తహతహలాడుచున్నవని తడబాటులేని మాటలలో తేటపరచింది''అని ఆచార్య సి. నారాయణరెడ్డిగారి వ్యాఖ్య.

నవవిధభక్తులలో నాలుగు భక్తి మార్గములను పోతన ఈ పద్యమందు పొందుపరచినాడు. మొదటి పాదములో శ్రవణము, రెండవ పాదములో దర్శనము, మూడవ పాదములో పాదసేవనము, నాలుగవ పాదములో కీర్తనము. రుక్మిణి బాలామణి మాత్రమేగాదు- మధురభక్తికి సంకేతముగా నిలిచిన మానినీ శిరోమణి.

"శ్రీయుతమూర్తి! సింహము పాలి సొమ్ము గోమాయువు కోరు విధమున, నిరంతరము నీ పాదపద్మములను స్మరించు నన్ను, మదోన్మత్తుడైన శిశుపాలుడు శీఘ్రముగా అపహరింప యత్నించు చున్నాడు.

*అంకిలి సెప్పలేదు చతురంగ బలంబులదోడ నెల్లి యో*
*పంకజనాభ! నీవు శిశుపాల జరాసుతులన్ జయించి నా*

వంకకు వచ్చి రాక్షస వివాహమున్ భవదీయ శౌర్యమే
యుంకువ సేసి కృష్ణ! పురుషోత్తమ! చేకొని పొమ్ము వచ్చెదన్
(ద. స్కం. 1705 ప.)

ఓ పురుషోత్తమా! నీవు చతురంగ సేనా సమేతుడవై వచ్చి శిశుపాల, జరాసంధుల నోడించి, రాక్షస వివాహ పద్ధతిలో నన్నెత్తుకొని వెళ్ళుము. అంతఃపురములోనున్న నన్ను తీసికొని పోవుటెట్లని భావింప వలదు-మంచి ఉపాయము చెప్పెదను. పెండ్లికి ముందుగా పెండ్లి కుమార్తెను మా ఇలవేల్పు అయిన మంగళగౌరిని కొలుచుటకు మావారు నన్ను పంపుదురు. నేను ఊరి వెలుపలనున్న దుర్గగుడికి మ్రొక్కు చెల్లించుటకై వచ్చెదను. అప్పుడు నన్ను నీవెంట తీసికొని వెళ్ళుము''అని రుక్మిణి బ్రాహ్మణుని ద్వారా శ్రీకృష్ణునకు ప్రణయ సందేశమును పంపినది.

ఆ బ్రాహ్మణుడు శ్రీకృష్ణునకు తెలిపిన రుక్మిణి రూపలావణ్య విశేషములను పోతనగారు పరమ రమణీయముగా అభివర్ణించినారు.

"పల్లవ వైభవాస్పదములు పదములు
గనక రంభా తిరస్కారు లూరు;
లరుణ ప్రభామనోహరములు గరములు
గంబు సౌందర్య మంగళము గళము,
మహిత భావాభావ మధ్యంబు మధ్యంబు
చక్షు రుత్సవదాయి చన్నుదోయి,
పరిహసితార్ధేందు పటలంబు నిటలంబు
జితమత్తమధుకర శ్రేణి వేణి
భావజాశుగముల ప్రాపులు చూపులా
కుసుమశరుని వింటికొమలు బొమలు
చిత్తతోషణములు చెలువ భాషణములు
జలజనయన ముఖము చంద్రసఖము

(ద. స్కం. 1712 ప.)

రుక్మిణి చరణములు చిగురుటాకుల జిగిని మించును. ఆమె తొడలు పసిడి అరటి బోదెలను పరిభవించును; అరచేతులు బాలారుణ కాంతులవలె మనోహరములు; ఆమె కంఠము శంఖము వలె కడు రమణీయము; నడుము ఉన్నదా లేదా అన్నట్లున్నది; చనుగవ కన్నుల పండువు గావించును; ఆమె నెన్నుదురు నెలవంకను గేలిచేయును; జడ గండు తుమ్మెదల బారును జయించును; ఆమె చూపులు మన్మథుని తూపులవలెను, కనుబొమలు మదనుని వింటి కొనలువలెను, ఆమె మాటలు మనస్సంతోషదాయకములుగను, ఆమె ముఖము చంద్ర బింబమువలె నున్నట్లు పోతన రుక్మిణి శరీరావయములను ప్రసిద్ధ ఉపమానములతో పోలికచెప్పి మనోహర ముగా అభివర్ణించినాడు. పోతనగారి యీ పోలికలు అనంతర పెద్దనాది ప్రబంధ కవుల నాయికా సౌందర్య వర్ణనకు మార్గదర్శకము లైనవి.

శ్రీకృష్ణుడు "విద్వన్నుత! నేను విదర్భ వచ్చెదను. భీష్మకుని పురము జొచ్చెదను. సురుచిరలీలను ఆ బాలామణిని తెచ్చెదను. అడ్డము వచ్చిన శత్రువులను చంపెదను" అని ఆ బ్రాహ్మణునితో పలికి, రుక్మిణి వివాహ ముహూర్తము తెలిసికొని, వెంటనే ఒకే రాత్రిలో విదర్భకు చేరినాడు.

భీష్మకుడు తన కుమారుని మాటప్రకారము, రుక్మిణిని శిశుపాలునకిచ్చుట కంగీకరించి, శుభకార్య ప్రయత్నములు చేయ సాగినాడు.

కుండిన నగరమంతయు శోభాయమానముగా, సర్వాంగ సుందరముగా అలంకరించినారు. రుక్మిణిని చేపట్టుటకై శిశుపాలుడు భటులతో, బంధుమిత్రులతో కుండిన నగరమునకు విచ్చేసినాడు. పెక్కుదేశములకు చెందిన రాజులు కుండినకు తరలివచ్చినారు.

ఆ సమయమందు రుక్మిణి తన మనస్సులో ఎన్నో విధముల ఆందోళన పడసాగినది.

"ఘనుడా భూసురుడేగెనో? నడుమ మార్గశ్రాంతుడై చిక్కెనో
విని కృష్ణుండది తప్పుగా దలచెనో? విచ్చేసెనో? యీశ్వరుం
డను కూలింపదలంచునో తలపడో? యార్యామహాదేవియున్
నను రక్షింప నెఱుంగునో యెఱుగదో? నా భాగ్యమెట్లున్నదో?"

(ద. స్కం. 1726 ప.)

"సుముహూర్తము రేపే. పెండ్లి దగ్గర పడుచున్నది. శ్రీకృష్ణుడెందుకు రాలేదబ్బా! మహనీయుడైన ఆ బ్రాహ్మణోత్తముడు ద్వారకకు వెళ్ళినాడో?లేదో? మార్గాయాసముతో మధ్యలోనే నిలిచిపోయి నాడేమో? శ్రీకృష్ణుడు నా సందేశమును విని తప్పుగా భావించి నాడేమో? లేక ఇక్కడికి వచ్చినాడో? గౌరీమహాదేవి నన్ను కాపాడునో? కాపాడదో? ఇంతకు నా అదృష్టమెట్లు న్నదో?'' అని నానావిధముల రుక్మిణి తలంచినది. కన్యా సహజమైన మోహము ఆవరించినప్పుడు అన్నీ సందేహములే కలుగును - వలచిన మనస్సులోని ఆటుపోటు లను పోతన పై పద్యములో సహజ సుందరముగా చిత్రించినాడు. మాంగల్య ప్రదాయినియైన ఆ సర్వమంగళాదేవిని సంస్మరించుటలో రుక్మిణి 'సౌభాగ్యసిద్ధి' నిర్దేశింపబడినది. ఆర్యామహాదేవి సంస్మరణమే విపత్సాగర తరణముకదా!

శ్రీకృష్ణుడు కుండిన నగరమునకు విచ్చేసినట్లు ఆ బ్రాహ్మణుని వలన తెలిసికొని, రుక్మిణి సంతోష స్వాంతయగును.

విదర్భ ప్రజలు శ్రీహరిని చూచి ఇట్లు భావించినారు :

"తగు నీ చక్రి విదర్భరాజసుతకుం; దథ్యంబు వైదర్భియుం
దగు నీ చక్రికి; నింత మంచి దగునే? దాంపత్య మీ యిద్దఱిం
ధగులం గట్టిన బ్రహ్మ నేర్పరిగదా! దర్పాహతారాతియై
మగడౌ గావుత జక్రి యీ రమణికిన్ మా పుణ్యమూలంబునన్"

(ద. స్కం. 1739 ప.)

"ఈ చక్రాయుధుడు రుక్మిణికి ఎంతయో తగియున్నాడు. నిజముగా వైదర్భి ఈ చక్రికి మిక్కిలి తగియున్నది. ఆహా! ఎంతటి

చక్కని దాంపత్యము! వీరిద్దరిని ఆలుమగలుగా జతగూర్చిన విధాత ఎంతటి నెరజాణ! మా పుణ్యఫలముగా ఈ చక్రాయుధుడు తన పరాక్రమముతో శత్రువుల పారద్రోలి, మా రాకుమారిని పెండ్లియాడు గాక!''అను పౌరుల మాటలలో స్వచ్ఛమైన అమాయికత్వమును, మంగళకరమైన ఆకాంక్షయు వెల్లడియగుచున్నవి.

రుక్మిణీ కన్య గౌరీదేవి నర్చించుటకై అంతఃపురమునుండి సపరివారముగా అమ్మవారి గుడికి వెళ్ళి అచ్చట దుర్గాదేవినిట్లు ప్రార్థించినది:

*"నమ్మితి నామనంబున సనాతనులైన యుమా మహేశులన్*
*మిమ్ము పురాణ దంపతుల మేలు భజింతుగదమ్మ! మేటి పె*
*ద్దమ్మ దయాంబురాశివి గదమ్మ హరిం బతి సేయుమమ్మ నిన్*
*నమ్మిన వారి కెన్నడును నాశములేదు గదమ్మ యీశ్వరీ!"*

*(ద. స్కం. 1743 ప.)*

ఉమామహేశ్వరులు పురాణ దంపతులు; అత్యంత సనాతనులు; పరమేశ్వరుని అర్ధాంగియైన పరమేశ్వరి దయాసముద్రరాలు; జనులుకోరిన కోర్కెలను తీర్చు తల్లి ఆమె. రుక్మిణి ముందుగా ఆదిదంపతులైన పార్వతీ పరమేశ్వరులకు నమస్కరించి, ఆ తరువాత ఆ చల్లని తల్లికి ప్రత్యేకముగా ప్రణమిల్లినది.

ఈ పద్యములో ఆ యమ్మను 'అమ్మ' 'అమ్మ'అని ఐదుసార్లు సంబోధించుట, రుక్మిణి భక్తి పారవశ్యమునకు పరాకాష్ఠగా చెప్పవచ్చును.

రుక్మిణి ప్రార్థన వ్యర్థము కాలేదు. తరువాత శ్రీకృష్ణుడు శత్రు రాజులు చూచుచుండగనే రుక్మిణిదేవిని ద్వారకానగరమునకు తీసికొని వెళ్ళి, అత్యంత వైభవముగా ఆమెను వివాహమాడినాడు.

ధ్రువకీర్తిని హరి పెండ్లియాడె నిజ చేతోహారిణిన్ మాన వై
*భవ గాంభీర్య విహారిణిన్ నిఖిల సంపత్కారిణిన్ సాధు బాం*

ధవ సత్కారిణి బుణ్యచారిణి మహా దారిద్ర్య సంహారిణిన్
సువిభూషాంబరధారిణిన్ గుణవతీ చూడామణిన్ రుక్మిణిన్

*(ద. స్కం. 1783 ప.)*

అంత్యప్రాసల దొంతరలతో పోతన కావించిన రుక్మిణీ కృష్ణుల కల్యాణగానమిది.

సమస్త సంపదలు కలిగించునది, సుజనులను, బంధువులను ఆదరించునది, పుణ్యపథసంచారిణి, దారిద్ర్యపరిహారిణి, కల్యాణ వేషభూషణధారిణి, రమణీ శిరోమణీ అయిన రుక్మిణిని శ్రీకృష్ణుడు పెండ్లియాడినాడు. అతడు శ్రీహరి-ఆమె చేతోహారిణి. అతని హృదయమును ఆనాడు సంపత్కారిణిగా, ఇందిరా సుందరిగా హరించినది. ఆ దంపతులే ఈ దంపతులు. లక్ష్మీనారాయణులే రుక్మిణీ కృష్ణులు. రుక్మిణీ కృష్ణుల కల్యాణము అభినవ భువన కల్యాణము!

దుర్గాదేవి అనుగ్రహముచేతనే రుక్మిణి కన్న కలలు ఫలించినవి - ఆమె కోరిక నెరవేరినది. శ్రీకృష్ణుని పతిగా పొందినది. ఈ విధముగా కోరిన కోర్కెలు తీర్చు తల్లి "దుర్గాదేవి".

గోపికలు కాత్యాయని వ్రతము గావించి, వస్త్రాపహరణ ఘట్టములో ముక్తిని పొందినారు.

పోతన భాగవతమందలి "రుక్మిణీ కల్యాణ" ఘట్టమందలి "దేవీతత్త్వ"మిది.



# 4. తిన్నడి కథ - ధూర్జటి కవితా మాధుర్యము

ఆంధ్ర సాహిత్య చరిత్రలో రాయలకాలము స్వర్ణయుగమని విమర్శకులు సంభావించిరి. కాలమాన పరిస్థితులు అనుకూలముగా నున్నపుడు భూమి సస్యసంపన్నమై ప్రజలు భోగభాగ్యములతో తులతూగునట్లు, రాయలకాలమున భాష కవితా సంపన్నమై, ఆంధ్ర సహృదయ లోకమును ఆనంద సంధాయకము గావించినది. అల్లసాని పెద్దన, ముక్కు తిమ్మన, ధూర్జటి వంటి కవి ప్రచండులు మనుచరిత్ర, పారిజాతాపహరణము, శ్రీకాళహస్తి మాహాత్మ్యము మొదలుగాగల రసజ్ఞ మనోజ్ఞ ప్రబంధములు రచించి ఆంధ్ర కవితామతల్లికి అలంకారములుగా సమర్పించిరి. రాయల ఆస్థానమునందలి అష్ట దిగ్గజ కవులలో నొకడు, శ్రీకాళహస్తీశ్వర చరణ కమల సేవా పరాయణుడు, శైవ సంవిత్కాసార మరాళ రత్నము, దివిషదన్న ప్రాయ వాగ్గుంఫ సంపత్కావ్య ప్రతిపాదక ప్రతిభుడు అయిన ధూర్జటి "శ్రీకాళహస్తి మాహాత్మ్యము"అను ప్రబంధమును అత్యంత భక్తిరస భరితముగను, ప్రతి పద్య రమణీయముగను రచించినాడు. 'స్తుతిమతియైన యాంధ్ర కవి ధూర్జటి పల్కులకేల కలిగెనో యతులిత మాధురీ మహిమ' అని శ్రీకృష్ణదేవరాయల ప్రశంసకు పాత్రుడైన కవి ధూర్జటి. ధూర్జటి సకల శాస్త్ర పాండిత్య సముపేతుడేగాక, మంత్ర తంత్రములు, సాంఖ్యాది యోగ రహస్యములు, వేద విజ్ఞాన మెఱింగిన కవిపుంగవుడు.

పోతనవలె ధూర్జటియు తన కావ్యమును నరాంకితము కావింపక, తన ఇష్టదైవమైన శ్రీకాళహస్తీశ్వరునకు అంకితమిచ్చినాడు.

'నీ శివభక్తి కావ్య సరణిం గడు ధన్యత బొంద నవ్య భాషా శతధా నిగుంభన రసస్థితి నొప్ప దలిర్ప జెప్పుమీ' అని కృతిపతియైన శ్రీకాళహస్తీశ్వరుడు ధూర్జటి కవీంద్రుని అనుగ్రహించినాడు.

శ్రీవిద్యానిధియై మహామహిమచే జెన్నై వసిష్ఠాజ లూ
తావాతాశన సామజాటవిక గోత్రాదేవ నత్కీర రా
జీవాక్షీ యుగ యాదవాధిపులకున్ శ్రేయస్కరంబైన యా
ర్యావామాంగము దివ్యలింగము మదీయాభీష్టముల్ సల్పెడున్.
(1 ఆ. 1 ప.)

అను పద్యముతో ధూర్జటి తన కావ్యారంభమునందు మంగళా చరణము గావించినాడు. అంతేగాక "వశిష్టునకు, బ్రహ్మకు, సాలె పురుగునకు, పామునకు, ఏనుగునకు, తిన్నడను బోయవానికి, నత్కీర కవీంద్రునకు, ఇరువురు వేశ్యలకు, యాదవాధిపతికి శ్రీకాళహస్తీశ్వ రుడు శ్రేయస్సును, ముక్తిని కల్గించె"నను ప్రధానేతివృత్తమును పై మంగళాచరణ పద్యమందు కవి సూచ్యార్థ సూచనము కావించినాడు.

తెలుగునందలి క్షేత్ర మాహాత్మ్య కావ్యములలో అగ్రగణ్య మైనది 'శ్రీకాళహస్తి మాహాత్మ్యము'. ఇందలి కథలన్నింటిలో ధూర్జటి కవితా నిర్మాణశక్తికి, అచంచల భక్తి భావమునకు తలమానికము వంటిది 'తిన్నడి కథ'యని విజ్ఞుల అభిప్రాయము. "ధూర్జటి ప్రతి చిన్న కథయును ఒక ప్రబంధముగానే కన్పట్టును" అను ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి మాటలు సర్వసమ్మతములు.

తిన్నడు నాథనాథుడను బోయవాని కుమారుడు. తల్లిపేరు తందె. ఉడుమూరు వారి నివాసము.

'ప్రబంధమ్ వర్ణనాప్రధానమ్'అనిగదా నియమము.

'తిన్నడి కథ'లో ధూర్జటి ఆరంభమందే ఉడుమూరు వర్ణనము కావించి, ప్రతి కథను ఒక రసవత్తర ప్రబంధముగనే తీర్చిదిద్దినాడు.

పట్టుచీరల గట్టు భాగ్యంబు గల్గియు
బారుటాకుల కట్టు భారమనరు,
రాజాన్నభోజన ప్రాభవశ్రీ కలిగియును
సస్య ధాన్యంబు నొల్ల మనరు,
మాణిక్య భూషణా సమాజంబు గల్గియు
నెర్రని గురువింద లేటికనరు,
మంచి మెచ్చుల తూగు మంచముల్ గల్గియు
జాలు పూదీగ యుయ్యాల లనరు,
ఎంత సంపద గల్గియు నెట్టివారు
తమ కులాగత ధర్మములు విడువ
జాల, రటుకాన తత్పురీ శబర సతులు
మహిమ గలిగియు మానరు సహజవృత్తి *(3 అ. 6 ప.)*

నిరాడంబరులైన ఆ కిరాతుల ఆచార వ్యవహారములు, తిను తిండి, తాల్చు నగలు, పండించు పంటలు, వినోద విలాసములు, కొలుచు దేవతలు - వారి సమగ్ర జీవిత విధానమంతయు ధూర్జటి సహజ సుందరముగా అభివర్ణించినాడు.

తిన్నడు బాల్యమునందే శివభక్తి రహితమై జగము చెడిపోయె ననుచు నవ్వసాగెను; ధృతి మోహబంధము తెగదన్ను గతి ముద్దు టడుగులెత్తి విదిల్చెడివాడు; భావ పరాఙ్ముఖుడైన పగిది సత్త్వము గూడి పొత్తుల పాన్పుపై పొరలెడివాడు; అతడు శ్రేయో మహారాజ్య సింహాసనమున నుండు విధమున కూర్చుండెడివాడు. విశ్వపతి తత్త్వమను మణిని వెదకు విధంబున వసుంధరాస్థలమునందు తడివి యాడెడివాడు. ఇట్లు దినదిన ప్రవర్ధమానములైన తిన్నని గుణగణములు శివభక్తి యుతములై చెలువొందినవి.

జలకంబార్చి విభూతిపెట్టి, కటి గుంజా బీజ సంకీర్ణమే
ఖల బంధించి, మయూర పక్ష లతికా కాండంబులం జేసి సం
దిలి దండల్పవరించి, కన్నుగవ గాంతిం గాటుకందీర్చి, మం
దుల తాయెత్తులు గట్టినన్ శబరపుత్రుల్గూడి యాడం బురిన్

(3 ఆ. 32 ప.)

బాల్యమునుండియే తిన్నడు శివభక్తి సమన్వితమైన వేషధారణ గావించుకొని, తోటి శబర పుత్రులతో గూడి యాడెడివాడు. గుడుగుడు గుంచాలు, డాగిలి ముచ్చులాటలు, గచ్చకాయలు, వెన్నెల కుప్పలు, తన్నుబిల్ల, బిల్లగోడు, లోటిళ్ళు మొదలైన శైశవ క్రీడలతో తిన్నడు అభినవ బాల్య సంపన్నుడగుచుండెను. చిన్నప్పుడే వాని విలువిద్యా నైపుణ్యమును చూచి కిరాతులు అతడు శివుని అంశమున పుట్టిన వాడని ప్రశంసించెడివారు. ఒకనాడు వేటాడి అలసిపోయి, పొన్నచెట్ల నీడలో ఒంటరిగా నిద్రించుచున్న తిన్నడికి జంగమమూర్తిగా శివుడు స్వప్నములో సాక్షాత్కరించి, కొండచరియలో స్వర్ణముఖీనది యొడ్డున గల భక్తులపాలిటి పెన్నిధియైన పార్వతీపతిని సేవింపుమని చెప్పి అదృశ్యుడయ్యెను. అతడు పుణ్యవశముచేత ఒక దివ్యలింగమును కాంచెను.

సంతోషంబునగాంచె తిన్నడు సమస్త వ్యాపకానంతవే
దాంతస్థాపిత చిన్మయాంగము, నవిద్యాధ్వాంత సంతాన సం
క్రాంత స్వాంత నిశాంత జంతు సుఖమార్గ ప్రాపకాభంగరు
క్కాంతాపాంగము దివ్యలింగము వివిక్తధ్యేయ నిర్లింగమున్

(3 ఆ. 63 ప.)

ఈ పద్యమందలి అంత్యానుప్రాస విన్యాసము, పోతన కవీంద్రుని తలపింపచేయును.

తిన్నడు సమస్త సృష్టియందు వ్యాపించినట్టిదియు, అనంతమై నట్టియు, ఉపనిషత్తులతో నిరూపింపబడినట్టిదియు, చైతన్య స్వరూపమైనట్టియు, అజ్ఞానాంధకారముతో కూడిన ప్రాణులకు ముక్తిమార్గమును చేకూర్చునదియు, నిరాకార స్వరూపమైనట్టిదియు నగు నొక దివ్య మహత్త్వముగల శివలింగమును కాంచెను.

తిన్నడు సంతోషస్వాంతుడై, ఆ దివ్యలింగమునకు సాష్టాంగ నమస్కారముచేసి, ముకుళిత హస్తుడై భక్తి పారవశ్యముతో ప్రార్థించిన ఘట్టమున కరుణరసము జాలువారినది.

*"ఓ సామీ! యిటువంటి కొండదరిలో, నొంటిం బులుల్ సింగముల్*
*గాసింబెట్టెడి కుత్ర నట్టడవిలో గల్జివ్వి క్రీనీడ, నే*
*యాసం గట్టితి వేటి గడ్డనిలు? నీవాకొన్నచో కూడు నీ*
*ళ్ళే సుట్టంబులు దెచ్చి పెట్టెదరు? నీకిందేటికే లింగమా?"*

(తృ. ఆ. 65 ప.)

కొండలందు కానలందు తిరిగి క్రొవ్వెక్కిన పందులను, లేళ్ళ దుప్పులను చెండాడి, మా చిన్నక్క పెద్దక్క నీకు కమ్మగా వండి పెట్టెదరు. మారు మాట్లాడక మా యుడుమూరికి రావలసినది. నివ్వరిప్రాలతో, గునుకుప్రాలతో, సవరపు మెకములపాలతో నీకు పాయసము వండి పెట్టుదురు. నేరేడి పండ్లు, నెలయూటి పండ్లు, కొండమామిడి పండ్లు, అడవిలోనున్న పండ్లన్నియు తెచ్చియిత్తును.

*ఇల్లో, ముంగిలియో, యనుంగుజెలులో, యీడైనచుట్టంబులో,*
*యిల్లాలో, కొడుకో, తరింపవశమే యేపోడుముల్లేక? మా*
*పల్లెం గోరిన వెల్లనుం గలవు తెప్పల్గాగ నీకిచ్చెదన్*
*జెల్లంబో! యిటనొంటినుండ కటు విచ్చేయంగదే లింగమా!*

(తృ. ఆ. 70 ప.)

"నీవు మాఊరికి రాకున్నచో నీతోడితేలోకమని ఇక్కడనే యుందును". ఇది తిన్నని ప్రార్థన. ఈ ఘట్టమంతయు తిన్నని హృదయమునందలి శివభక్తి తత్పరతను సూచించును-ధూర్జటి కవీంద్రుని శైలి నిర్ఝర గంగానదివోలె పరుగులు తీసినది ఈ సన్నివేశములో.

"నాకు శివుడే తల్లి, తండ్రి, చుట్టము, ప్రభువు. నా దేవునికై నా ప్రాణములను సైతము విడుతును"అని తోటిబోయకుమారులతో పలుకుట తిన్నని నిష్కళంక భక్తి సంపన్నతకు నిదర్శనము. తాను చంపిన పంది మాంసపు ముక్కలను ముందుపెట్టి "ఓ శివా! నీవీకరకుట్లు ఆరగింపనిచో ఇంక నా బ్రతుకెందులకు? నీ పాద పద్మాలపై నా ప్రాణములను విడుతును"అని పలికి ఏడవసాగినాడు. శివుడాతని భక్తికి సంతసించి, వాని ముందు ప్రత్యక్షమై కరకుట్లు ఆరగించినాడు. ఇట్టిది తిన్నని దైవభక్తి. తిన్ననికి పరమేశ్వర సాక్షాత్కార సందర్భమున కవి అద్భుత రసమును పోషించినాడు.

పరమశివుని ఆరాధించుటకై వచ్చిన ఒక బ్రాహ్మణోత్తముని రూపమును ధూర్జటి మనోహరముగా అభివర్ణించినాడు.

పంచాక్షరీపూత భసిత త్రిపుండ్రాంకి
తాంగ భాగములు, స్నానార్ద్ర శిఖయు,
గ్రమ కృతగ్రంథి సూత్ర ప్రోత రుద్రాక్ష
భూషణంబులు, శైవ భాషణములు,
నాగుల్భలంబమానాంబు శోణంబైన
పోత్రంబు, నుపవీత సూత్రములును,
గర గృహీతాభిషేక క్షీర సంపూర్ణ
భాండంబు, బుష్పకరండకంబు
గుండబొజ్జయు, నొకపాటి గుజ్జురూపు,
నుత్తరీయంబు దనరంగ యోగి హృదయ

గోచరుని గొల్వ శివచిహ్న గోచరాంగు
డొకడు వచ్చె శివబ్రాహ్మణోత్తముండు. (తృ. ఆ. 94 ప.)

భస్మత్రిపుండ్రాంకితములైన శరీర అవయవములు - స్నానము చేసి శిఖముడి వేసిన జుట్టు-వరుసగా ముడులువేసి త్రాటనుగట్టిన రుద్రాక్షమాలికలు-మడమల వరకు వ్రేలాడు నీర్కావిధోవతి - యజ్ఞోప వీతములు-అభిషేకమునకై పాలతో నిండిన పాత్ర-మరొక చేత పూల సజ్జ - కుండబొజ్జ - ఒకపాటి పొట్టి ఆకారము కలిగి శివారాధనమునకై వచ్చు బ్రాహ్మణుని, ధూర్జటి పాఠకుల కనులముందు సాక్షాత్కరింప జేసినాడు.

శివుని పూజించుటకై వచ్చిన ఆ బ్రాహ్మణోత్తముడు నిర్మలమైన శివలింగమున చారికలు కట్టుట గాంచి, ఇచటి కెంగిలి విస్తరాకులెట్లు వచ్చినవని విస్తుపోయినాడు. పరిశుద్ధముగానున్న ఆలయమును అసహ్యము కావించిన పాపాత్ముని పేరు తెలుపుమని బ్రాహ్మణుడు శివుని ప్రార్థించినాడు. నీవాతని పేరు చెప్పనిచో, తిండి తినుట మాని, నా ప్రాణములు విడిచెదని పలికినాడు. అపుడు శివుడు "శివగోచరా! నీవు విచారింపనేల? ఒకానొక చెంచువాడు వేద విరుద్ధమైన పద్ధతిలో మహాభక్తితో నన్ను ప్రతిరోజు సేవించుచున్నాడు. వానిపై దయచే ఆ కిరాతుని పూజకంగీకరించితిని. వాని భక్తిని నేడు నీవే చూడ వచ్చును. నా వెనుక దాగియుండుము. అతడిప్పుడే వచ్చును"అని పల్కెను. ఆ బ్రాహ్మణుడు శివలింగము చాటున దాగినాడు.

యథావిథిగ తిన్నడు వచ్చి, చెప్పుకాలితో శివలింగముమీది నిర్మాల్యము ప్రక్కకు త్రోసి, పుక్కిటినీటితో అభిషేకించి, పత్తిరి సమర్పించి, దారికాచి, చంపిన పంది మాంసపు ముక్కలను ముందు పెట్టి, శివుని తినమని కోరెను. శివుడు తినలేదు. అట్లు తినకుండుటకు కారణము గురించి తిన్నడు ఆలోచించుచుండగనే, ఆతని భక్తిని పరీక్షించుటకై శివుడు తన కంటి వెంట పాట పాట కన్నీరు కారునట్లు

చేసెను. తిన్నడు అడవిలో తాను విన్న, కన్న మందులు తెచ్చి వాడినాడు-కాని లాభము లేకపోయినది. ఇంతలో శివుని కంటి వెంట నెత్తురు కారుట మొదలిడెను. 'కంటికి కన్ను' మందని తలంచి, తిన్నడు తన కన్నును బాణముతో పెరికి, ముక్కంటి కంటి కంటించి నాడు. ఇంతలో శివుని రెండవ కంటి నుండి నెత్తురు కారసాగినది.

"నీ కృపచేత గన్న మందున్నది, దీనికిన్ వెరవనొక్కటి నా వ్రతమింక శంకరా!"అని భావించిన భక్తి భావ సంపన్నుడు తిన్నడు. మనోదృష్టికి మూలమగు తన ప్రాణములను సైతము తృణప్రాయ ముగా భావించి, తిన్నడు స్వామికి సమర్పింపనెంచి, తన కాలితో నెత్తురు కారుచున్న శివుని కంటి నదిమియుంచి, తన రెండవ కన్నును పెకలింపసాగినాడు. అంతట దయామయుడైన శివుడు "అగు మాగు" మని పలుకుచు, తిన్నని భక్త్యావేశముకంటె ముందే, వాని బాణమును చేతితో పట్టుకొని, పార్వతీ సమేతముగా ప్రత్యక్ష మయ్యెను.

*హరి యరవింద సూతి మును లష్టదిశాపతులాదిగా వియ*
*చ్చరు లిరువంకలం గొలువ సత్వర తన్నిజలింగ నిర్మలాం*
*తరమున నుండి శీత వసుధాధర కన్యక ముద్దు గేలు దా*
*మర కడవ్రేలు వట్టుగొని, మన్నన తిన్ననికిం, బ్రసన్నుడై.*

(*తృ. ఆ. 120 ప.*)

తమకు ప్రత్యక్షమైన పరమేశ్వరుని తిన్నడు, శివబ్రాహ్మణు లిరువురునిట్లు కోరుకొనిరి.

*మీ పూర్ణంబగు దివ్యతేజము జగన్మిథ్యాత్మకత్వ ప్రతి*
*ష్ఠా పారీణత జూపి మమ్ము బొదవం జాంచల్యా దూరంబులై*
*చూపుం జిత్రము మిన్నకున్నయవి, యచ్చో బాసె దేహంబుపై*
*దీపుం జీకటి, యింతకంటె వరమేదీ? యిట్లు మన్నింపవే?*

(*3 ఆ. 123 ప.*)

"పరిపూర్ణమైన మీ దివ్యతేజముచే 'జగత్తు మిథ్యా' అను భావము దృఢమైనది. మా చూపులు నిశ్చలములైనవి. మాకు ఈ దేహముపై తీపి తొలగినది. ఇంతకంటె మాకు వరమేమి కావల యును? ఈ లోకము, జీవాత్మ పరమాత్మ, నిజముగ నీవేయని వేదములు తెలుపుచున్నవి. పరిపూర్ణమైన చిద్రూపాకాశములో మమ్ములను చేర్చి మాకు 'పునర్జన్మ' బాధను తొలగింపుము.

"ఆనందామృత వారిని
ధానంబున మనము మగ్నతంబొందె, వరం
బీనమరిన దాదాత్మ్యం
బో నిరుపాధిక దయా సముజ్జ్వల! యీవే." *(3 ఆ. 127 ప.)*

ఆనందమనెడి అమృత సముద్రములో మా మనస్సులు మునిగిపోయినవి. మమ్ములను నీలో తాదాత్మ్యము చేసి కొనుము." అని వారిరువురు ప్రార్థించిరి. పరమశివుడనుగ్రహించి బోయవాడైన తిన్నని, ఆ శివబ్రాహ్మణుని ఇరువురిని తనలో కలిపికొని సాయుజ్య మొసంగెను.

తిన్ననిది జానపద భక్తి; శివబ్రాహ్మణునిది నాగరక భక్తి. ఒకరిది శాస్త్ర విరుద్ధమైన భక్తి - మరొకరిది వేదవిహితమైన భక్తి. తిన్ననిది మూఢభక్తి - బ్రాహ్మణోత్తమునిది జ్ఞానభక్తి; ఇరువురును భక్తితో నిండిన మనస్సులు కలవారే! ఆ భక్తిని వ్యక్తీకరించు పద్ధతియందే భేదమున్నది. కావుననే పరమేశ్వరుడు తన భక్తులిరువురకును మోక్షమును ప్రసాదించినాడు.

భగవంతుని అనుగ్రహము పొందుటకు నిశ్చలమైన భక్తియే సాధనమనియు, తనయెడల విశ్వాసము కలిగిన భక్తులను పరమేశ్వ రుడు అపారమైన దయతో అనుగ్రహించుననియు "తిన్నడి కథ" నిరూపించుచున్నది.

ధూర్జటి మహాకవి ఆత్మీయతకు "శ్రీకాళహస్తి మాహాత్మ్యము" నందలి తిన్నడు, నత్కీరుడు ప్రతిరూపముల వంటివారు. ఈ కావ్యము నందలి భావములు ఆతని హృదయాంతరాళము నుండి వెలువడినవి. భక్తి వివశములగు తన పాత్రములతో కవి తాదాత్మ్యమును పొందుట ఉత్తమ కవితా సంప్రదాయముగదా!

"కృష్ణదేవరాయల నాటి ఇతర కావ్యములకంటె నెంతయు విశిష్టమైనది ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యము. ఇందలి వస్తువు, రచన, భావములు వేరు తెరగుల యీ కావ్యము మొదటి నుండి తుది వరకు కవియొక్క జీవలక్షణమైన అంతర్ముఖత్వమును పట్టి చూపునదిగ నుండును. క్షేత్రమహిమ వస్తువయిన కావ్యములు దీనికి ముందటివి, తరువాతవియు కలవు. అవి దీనివలెనొక వివిక్తాను భూతిని ముద్రింపగల్గినవికావు. కవి యేకాంతతనొంది శివునితో సాయుజ్యమును తెలుపదు. ధూర్జటి యాత్మ శివసాన్నిధ్య సుఖము ననుభవించినది. అచ్చమైన యాసుఖము ఈ కావ్యమును ద్వార మొనర్చుకొని భావుకుల హృదయకుహరములలోనికి జొర బారును. విరళ జనిత సంపాతమైన అరణ్య గర్భమందలి ప్రశాంత సరస్సును ఈ కావ్యమునకు ఉపమానముగా చెప్పవచ్చును"-అని ధూర్జటి "శ్రీకాళహస్తి మాహాత్మ్య" కావ్య ప్రాశస్త్యమును శ్రీ మల్లంపల్లి శరభేశ్వరశర్మగారు నుగ్గడించి యుండిరి.



# 5. ఉత్తర రామాయణము-
# కంకంటి కరుణరస పోషణము

రామాయణము భారతీయులకు పరమ పవిత్రమైన గ్రంథము. ఆదర్శ మానవ జీవితమును అది ప్రబోధించినది. ధర్మ పరాయణతను, సత్య సంధతను, పితృవాక్య పరిపాలనను, భాతృ భక్తిని-ఇత్యాది మహోన్నతమైన గుణగణములను మానవజాతి కందించిన మహనీయ గ్రంథము రామాయణము.

వాల్మీకి మహర్షి రామాయణ గాథను బాలకాండ, అయోధ్యా కాండ, అరణ్యకాండ, కిష్కింధకాండ, సుందరకాండ, యుద్ధకాండ, ఉత్తరకాండ- అను ఆరు విభాగములు గావించి ఆదికావ్యము నవతరింపచేసి ధన్యుడైనాడు. రామాయణములోని ఉత్తరకాండను ఉత్తర రామాయణముగా నాలుగువేల శ్లోకములుగా మహర్షి తీర్చిదిద్దినాడు. తెలుగులో తిక్కన సోమయాజి నిర్వచనోత్తర రామాయణమును పది ఆశ్వాసములలో 1260 పద్యములలో తెనిగించి, మూల రామాయణమును సంక్షేపించినాడు. 17వ శతాబ్దికి చెందిన కంకంటి పాపరాజు ఎనిమిది ఆశ్వాసములలో 3000 పద్య గద్యములలో రసభరితముగను, ఔచితీ పోషకముగను పరమ పావనమైన శ్రీరామచంద్ర భగవానుని దివ్యచరిత్రను ప్రతిపాదించుచు 'ఉత్తర రామాయణ' ప్రబంధమును తెలుగుజాతి కందించి ధన్యుడైనాడు.

పరమ శ్రావ్య మఘువ్య యామిత కథాభవ్యంబు, దీవ్యత్సుధీ
పరిషత్సంతత సేవ్య, మబ్జభవ సంభావ్యంబునై మించు ను

త్తర రామాయణ కావ్యమున్ మృదు వచోధారార్థ సందర్భ ని
ర్భర తత్త్రదసముల్ రహింప రచియింపం బూనితిన్ వేడుకన్.

(ఉ. రా. పీఠిక 13 ప.)

మానవ కర్మ భూమిపై మానుష దేహముతో హితాహిత జ్ఞాన సంపన్నుడగు కంకంటి కవీంద్రుడు చారుకవిత్వము నేర్చి, జానకీ జానికథలను పరమ శ్రావ్యముగను, మృదు వచోధారార్థ సందర్భముల తోను, ఆయారసములు పోషించుచు రచించి తెలుగుజాతి కందించినాడు.

శ్రీకర రామ మంత్ర జపసిద్ధి ప్రసిద్ధి వహించి వెన్క వా
ల్మీకి రఘు ప్రవీరు కథలే రచియించి గదా చెలంగె, ము
ల్లోకములందు నెల్ల మునులుం గొనియాడగనట్టిదవుట ఖ
ణ్యాకరమైన రామకథ హైన్యము మాన్పదె యెట్టివారికిన్.

(ఉ. రా. పీఠిక 16 ప.)

ఇహపర సాధకంబై రహించు ప్రబంధ మొనర్ప శ్రీ రఘు రాముని చరిత్రము తనకు వాసిగ దొరికినదని కంకంటి కంఠోక్తిగా చెప్పినాడు.

ఉత్తర రామాయణములో పూర్య రామాయణ కథ, శ్రీరామ పట్టాభిషేకము, విశ్రవోబ్రహ్మకథ, మాల్యవదాదుల చరిత్ర, రావణ కుబేరుల యుద్ధము, లవణాసురవధ, శంబూక వధ, రంభారావణుల సంవాదము, మేఘనాథుని వీరత్వము, రాముని అశ్వమేథము, కుశలవుల రామాయణగానము, సీతా పరిత్యాగము, వాల్మీకి సమాదరణము, సీత రసాతల గమనము, కుశలవ పట్టాభిషేకము, శ్రీరాముని అవతార సమాప్తి - మొదలైన ఘట్టములెన్నియో ప్రకృష్టమైన ప్రతిభా పాండిత్యములతో సర్వాంగ సుందరముగను,

సహృదయ హృద యంగమముగను కంకంటి పాపరాజు నిర్వ హించినాడు. పూర్వ రామాయణములో ఉత్తమ మానవునిగా చిత్రింప బడిన రాముడు, ఉత్తర రామాయణములో అతనికి దివ్యత్వము ఆరోపింపబడినది. పూర్వ రామాయణములో కేవలము క్రూరులుగను, రాక్షసులుగను కనిపించు రావణాదులు, ఉత్తర రామాయణములో ఉత్తమ మానవులుగను, ధీరులుగను, పరాక్రమవంతులుగను సాక్షాత్కరించుదురు.

"ఏకో రసః కరుణ ఏవ"అని ఆర్యోక్తి. అసలు రామాయణ మహా కావ్యావతరణమునకు శోకమే కారణము.

మానిషాద ప్రతిష్ఠాంత్వ
మగమ శ్శాశ్వతీ స్సమాః
యత్ క్రౌంచ మిథునాదేక
మవధీః కామ మోహితమ్

కంకంటివారి ఉత్తర రామాయణమందలి సన్నివేశములలో "సీతా వనవాసము" కరుణ రసమునకు కాణాచి. లోకాపవాదమునకు వెరసి, సత్యసంధుడు, ధర్మపరాయణుడైన శ్రీరామచంద్రుడు భార్యయైన సీతాదేవిని అడవిలో దిగవిడిచి రమ్మని లక్ష్మణుని ఆదేశిం చును. అన్నగారి మాట జవదాటని భాతృభక్తి పరాయణుడైన లక్ష్మణుడు, సీతమ్మను కాననములో దించి వచ్చు సన్నివేశము కంకంటి కవీంద్రుని కమనీయ కవితా రీతికి ప్రత్యక్ష తార్కాణము- రస అలంకారాది రమణీయ రచనా సంవిధానమునకు ప్రబల నిదర్శనము.

"జగత్పావనీ! నీ విమల ప్రభావమును, నీ వినయాదిక సద్గుణ ములు దేవుడెరిగి యుండియును, నిందలకు భయపడి, నిన్నిచ్చటి

కంపినాడు. ఇకమీదట యీ విరహాబ్ధి నేకరణి నీదు లాడునోగదా!"అని సీతావియోగమునకు రాముడెట్లు దుఃఖించునోయని శోకసంతప్త హృదయాంతరంగుడై లక్ష్మణుడు సీతతో పలికినాడు.

*మితిలేని మిడి మేలంపు మెకములు*
*సకియల బలగమే? జనని నీకు,*
*పరికింపరాని యీ బలుమలల్ నవరత్న*
*మయ చంద్ర శాలలే? మాత నీకు,*
*కడు భీతి ముంచు నీ గహనముల్ విహరింప*
*దగిన పూదోటలే? తల్లి నీకు,*
*ఘోర నక్ర భుజంగ కోటితో మలయు నీ*
*హ్రదములు కొలకులే? యంబ నీకు,*
*బంధురములైన యీ మహా ప్రస్తరంబు*
*లిందు మణి వేదికలె? జనయిత్రి నీకు,*
*కటకటా! యెంటి నిచ్చోట నెటుల నిలిచె*
*దమ్మ! నీ యున్కి కేమందు నమ్మ! నేను.* (ఉ. రా. 6 ఆ. 273 ప.)

ఈ పద్యములో లక్ష్మణుని హృదయావేదన వెల్లడియై కరుణ రస పోషకమగుచున్నది. భోగభాగ్యములతో తులతూగవలసిన శ్రీరామ చంద్రుని దేవేరికి ప్రాప్తించిన శోచనీయ దశ కన్నులకు కట్టినట్లు కంకంటి పాపరాజు అభివర్ణించినాడు. యతిస్థానములో కుదురుకొనిన జనని, మాత, తల్లి, అంబ, జనయిత్రి, అమ్మ - అను సంబోధనలు సుమిత్రానందనుని శోకావేశమునకు ప్రతీకలు.

లక్ష్మణుడు గంగాతీరమందలి అడవిలో సీతమ్మను విడిచి, రామాజ్ఞను వదినెగారికి చెప్పలేక కన్నీరు మున్నీరుగా విలపించు సన్నివేశము అత్యంత హృదయ విదారకరముగా నున్నది. అప్పుడు

సీతాదేవి మఱదియైన లక్ష్మణునితో అన్నమాటలు -

పరసతులెల్ల తల్లులుగ భావనసేయుదు వెల్ల వేళలన్,
పరధనమన్న హాలహలు భంగిగ జూతువు, బొంకవెన్నడున్
పరుషములాడ వెవ్వరిని, బ్రాహ్మణ భక్తియు, రామసేవయున్
తిరమగు నీకు తండ్రి! జననిందిత కృత్యము లెవ్వి యియ్యెడన్.

*(ఉ. రా. 6 ఆ. 259 ప.)*

లక్ష్మణుని గుణగణములను పాపరాజు మనోజ్ఞముగా సీతాదేవి నోటివెంట పలికింపజేయుట విశేషము!

జననీ నీవు మహా పతివ్రతవు; నీ సౌశీల్య మిల్లాండ్రకె
ల్లను మేల్బంతి; రఘూద్వహాంఘ్రి యుగళీ లగ్నాత్మవైయుండు
మని నేనెవ్వడ విన్నవింప; పతి బాయన్ జేసి నిన్నొంటి ˙డిం
చిన పాపాత్ముడ నూరికేగు మనుచున్ సెల్విచ్చెదే నావుడున్

*(ఉ. రా. 6 ఆ. 274 ప.)*

అని లక్ష్మణుడు, సీతాదేవి సౌశీల్యాదులను, పాతివ్రత్యమును ప్రశంసించి, తన్ను తాను నిందించుకొనుటలో - ఆతని పవిత్ర హృదయము పాఠకులకు అవగతమగుచున్నది.

అల్లలన యతని వచనము
లెల్లన్ విని మొదలు నఱుక నించుకవడిలో
ద్రెళ్ళెడి కదళికవలె హా
తల్లీయని బెట్టు సొరిగి ధరపై బడియెన్. *(ఉ. రా. 6 ఆ. 275 ప.)*

మఱది - లక్ష్మణుని మాటలు విని మొదలు నఱికిన కదలిక వలె "హా! తల్లీ"యని బెట్టు సొరిగి సీతాదేవి నేలపై బడినది. ఇందలి ఉపమానము మనోజ్ఞమై భాసించినది.

"ఆ కృశాంగి మరల కన్ను దామరలు విచ్చి విచ్చలవిడి వెడలెడి యశ్రుజలధారా ప్రవాహంబులు చెక్కుటద్దంబులపై జాలువాఱి జాళువా మెఱుంగు పయ్యెద చెఱంగు మీదికి దిగజాఱి యుత్తుంగతర స్తన కనక కలశంబులు నిండుకొన మెండుకొను నిట్టూర్పు సెగలను దగిలి, చిగురు వాతెర తుకతుక నుడుక..." శోకమూర్తియైన సీతమ్మను మన కళ్ళెదుట సాక్షాత్కరింపజేసి కవి మనచే కంట తడిపెట్టించు సన్నివేశము - కరుణ రసమునకు పరాకాష్ఠ. కంకంటి కవీంద్రుని దృశ్య సాక్ష్యాత్కార రచనా నైపుణ్యమునకు ఈ సన్నివేశము ప్రత్యక్ష సాక్ష్యము - అంతేగాక పాపరాజు హృద్యమైన గద్య రచనకు, మధుర వాగ్గుంభనలకు ఈ ఘట్టము చక్కని నిదర్శనము. దృశ్య సాక్షాత్కా రము కవి ప్రతిభా పాండిత్యములకు అద్దము పట్టును - కవిని మహాకవిగా తీర్చిదిద్దును. తిక్కనవలె అట్టి మహాకవుల కోవలోనికి చెందినవాడు కంకంటి పాపరాజు.

*కటకట లక్ష్మణా! పిడుగు కంటెను బెట్టిదమైన మాటనే*
*డిటు విని యుండియున్ బగుల దింతలు నింతలుగాదు గుండె యె*
*ప్పటి వలె నున్న దీకటిక భావముతో నసువుల్ భరించి యి*
*య్యటవినె యింక నేవలన నాపద లొందగ నున్న దాననో.*

(ఉ. రా. 6 ఆ. 281 ప.)

"నా గుండెలు బండవి. నా ప్రాణాలు మొండివి. పిడుగుకంటె భయంకరమైన వార్త వినికూడ నా గుండెలు బద్దలు కాలేదు. ఈ మొండి ప్రాణాలతో యీ అడవిలో ఇంకా ఎన్ని ఇక్కట్లు అనుభ వించవలసి ఉన్నదో!"అని సీతాదేవి పలురీతుల వాపోయినది.

*"ఎన్నటికిన్ రఘూద్వహుని నేనును నన్నిక రామచంద్రుడున్*
*గన్నుల జూడ గల్గదొకొ కల్గక యుండిన బ్రాణమేల పో*

దన్న రఘు ప్రవీరు చెవులారగ నింతయు దెల్పు నాదుమే
నున్నది చెంత గంగమడుగున్నది యైనటు లయ్యెడున్ దుదిన్"

(ఉ. రా. 6 ఆ. 283 ప.)

రఘువంశ మహావీరుడు కనుకనే వంశ గౌరవమునకు లోటు రాకుండ తన్నుపరిత్యజించినాడనివ్యంగ్యముగా కవి "రఘూద్వహుడు, రఘు ప్రవీరుడు" అను విశేషణములు సాభిప్రాయముగా ప్రయోగించి నాడు. గంగలో దూకి ప్రాణములు వదిలిపెడతానని అనకుండా "నాదు మేనున్నది చెంత గంగమడుగున్నది" అనుటలో సున్నితమైన ధ్వని కలదు.

ఆ కరుణ యా ప్రసన్నత
యా కురిమి యా ప్రియోక్తి యా గారవమున్
గాకుత్స్థుడు మఱచెగ
యాకస్మికముగ జనించు నపవాదమునన్.

(ఉ. రా. 6 ఆ. 286 ప.)

ఈ పద్యములో "ఆ" కరుణ, "ఆ" ప్రసన్నత, "ఆ" కూరిమి, "ఆ" ప్రియోక్తి, "ఆ" గారవము అని ఐదుసార్లు ప్రయుక్తమైన తచ్ఛబ్దము వలన సీతారాముల అపారమైన అనన్య సామాన్యమైన అన్యోన్యానురాగము కవి ధ్వనింపచేసినాడు.

ఆకర్ణాయత నేత్రమై మణిమయోద్యత్కుండల ద్వంద్వశో
భాకీర్ణాంచిత గల్లమై, సురదనంబై, సుందర భ్రూయుతం
బై, కమ్రస్మిత చంద్రికా విలసితంబై యొప్పు శ్రీరాము మో
మీ కాయంబున జూచు భాగ్యమిక లేదేమో? సుమిత్రాత్మజా!

(ఉ. రా. 6 ఆ. 288 ప.)

తమ అన్యోన్యానురాగము స్మృతికి వచ్చినంతనే సీతాదేవి హృదయ దర్పణములో శ్రీరామచంద్రుని ప్రసన్న మధురమైన ముఖము ప్రతిబింబించినది. ఆకర్ణాంతాలైన ఆ విశాల నేత్రాలు, రత్నకుండల దీప్తులు ప్రసరించు ఆ చిక్కని చెక్కిళ్ళు, సురుచిరమైన దంత పంక్తి, ఆ అందాల కనుబొమలు, ఆ మధుర మంజుల మందస్మిత చంద్రికలతో కూడిన ఆ ముఖము - అటువంటి శ్రీరామ చంద్రుని ముఖమును సందర్శించు అదృష్టము ఈ జన్మకు ఇక లేదేమో సౌమిత్రీ!"అని సీతమ్మ వాపోయినది. 'స్వభావోక్తి'యుతమైన ఈ పద్యము, శ్రీరాముని ముఖమువలెనే ప్రసన్న మధురముగా కంకంటి రచించినాడు.

*అన్న లక్ష్మణ! యింక నాలస్యమేటికి*
*జను మయోధ్యా పురంబునకు నీవు,*
*ముప్వురత్తలకును మ్రొక్కితినని తెల్పు,*
*మచటి బంధుల నెల్ల నడిగితినను,*
*మతి కృపాళునకు రామావనీంద్రునకు*
*నా మ్రొక్కుగా నతిభక్తి మ్రొక్కుమీవు,*
*తన యాజ్ఞ తలదాల్చి జననింద తను*
*చెందనీక కానల చరియింతుననుము,*
*భూజనుల బాంధవుల లెస్స ప్రోవు మనుము,*
*తలప నా కేడుగడయును దానె యనుము,*
*భావమెప్పుడు తన మూర్తి బాయ దనుము,*
*నెమ్మి యొక యింత నామీద నిల్పుమనుము.*

*(ఉ. రా. 6 ఆ. 292 ప.)*

అని లక్ష్మణునితో పలుకుటలో సీతాదేవికి పెద్దలయెడగల గౌరవాభిమానములు, పతిపైగల అనురాగమును, బంధువులు,

భూజనులయెడగల ఆదరాభిమానములును వెల్లడియగుచున్నవి; సీత పలుకులు ఆమె మహోన్నతమైన సౌశీల్యమును నిరూపించుచున్నవి.

*పోయి రమ్ము శుభంబులు బొందు నిన్ను*
*నన్ను మఱవక యుండుమా యన్న యనుచు*
*గన్నుగవ నశ్రుధారలు గ్రమ్ముకొనగ*
*నన్నెలంతుక దీనయై యడలుచున్న* *(ఉ. రా. 6 ఆ. 293 ప.)*

అని సీత లక్ష్మణుని ఆశీర్వదించినది. ఆమె కన్నుల వెంట అశ్రుధారలు కారినవి. దీనయై యున్న ఆమెను గాంచి లక్ష్మణుని మనఃస్థితిని కంకంటి కవి వర్ణించిన తీరు పరమాద్భుతముగా నున్నది - కవి మనస్తత్వ నిరూపణమును తెలియజేయుచున్నది.

*చన కాళ్ళు రాక, చనకిక*
*జనదని ధేనువును బాయజాలని వత్సం*
*బును బోలి జాలి గొని యో*
*జననీ! జననాథు గొలువ జనుదునె యనుచున్.*

*(ఉ. రా. 6 ఆ. 294 ప.)*

లక్ష్మణుని ధేనువును విడువజాలని వత్సముతోను, సీతమ్మను ధేనువుతోను పోల్చి వర్ణించిన పై పద్యము కంకంటి కవీంద్రుని అలంకార రచనా విన్యాసమునకును, ఔచితీ విలసనమునకును పరమ ఉదాహరణముగా పేర్కొనవచ్చును.

లక్ష్మణుడు వెడలిన తరువాత సీత విధిని నిందించుచు పరితపించినది.

*రమణి మఱికొంత వడి దాక రథము జూచు*
*తరుణి మఱికొంతసేపు కేతనము జూచు*

కాంత మఱిమీద రథపరాగంబు జూచు
పడతి మఱి యంతటను వట్టి బయలు సూచు.

(ఉ. రా. 6 ఆ. 299 ప.)

ఈ గీత పద్యములో సీత దృష్టిని పురస్కరించుకొని రథ గమనమును కవి స్ఫురింపచేసినాడు.

చూచి చూచి చొక్కి సృక్కి తాలిమిదక్కి
వగల పొగిలి యూర్పు సెగల నొగిలి
దిగులు దగుల కుంది వగ జెంది బెగడొంది
యలసి సొలసి మూర్ఛ లొలసి తెలిసి

(ఉ. రా. 6 ఆ. 300 ప.)

పై పద్యమందు అడుగడుగున అనుప్రాసలు ప్రయోగించి, సీతాదేవి నిరీక్షణను, నిరాశ నిస్పృహలను, దిగులును, విచారమును, వేదనను స్ఫురింపచేశాడు కంకంటి కవి.

ఒడిమీద నిడుకొని యురముపై జేర్చుట
  చేరిక కది కడసారి యేమొ?
చెక్కు చెమ్మటలను చెఱగున తుడుచుట
  చెలిమికి నది తుడి చీటి యేమొ?
పుక్కిట తావి కప్పుర వీడె మిచ్చుట
  యనురాగమున కది యవధి యేమొ?
కోరిన పని కియ్యకొనుటది కరుణా ప్ర
  బంధమ్మునకు ఫలగ్రంథమేమొ?
మోము మోమున గదియించి ముద్దుగొనుట
యదియె మోహంపు పనికి దీఱుదల యేమొ?
యెల నగవు దేర జూచి లోపలి కనుచుట
మేలు చిన్నెల కది పొలిమేర యేమొ? (ఉ. రా. 6 ఆ. 302 ప.)

లక్ష్మణుడు వెడలిన అనంతరము గంగా తీరములో ఒంటరిగా కన్నీరు కార్చుచున్న కరుణామయి సీతమ్మ ఉద్విగ్న హృదయములో ఉవ్వెత్తుగా లేచిన విచార వీచికలను కంకంటి పాపరాజు పై పద్యములో రసవంతముగా అభివర్ణించినాడు.

*రాజ కులాభిరాముడగు రామునిదేవి! విదేహ ధారుణీ*
*రాజకుమారి! పంక్తిరథ రాజ బిడౌజుని పెద్ద కోడలీ*
*రాజముఖీ లలామ; యలరాజ సహోదరి బోలు నీమెకున్*
*బూజలు సేయగా దగు తపోధన కాంతలు మీరలందరున్*

(ఉ. రా. 6 ఆ. 318 ప.)

పతి పరిత్యక్తయై గంగాప్రాంత కాంతారములో ఒంటరిగా శోక వ్యాకులయైన సీతాదేవిని వాల్మీకి మహర్షి సమాదరించి ఆశ్రమానికి కొనివచ్చి మునికాంతలతో అన్నమాటలివి.

"ఈ సీతాదేవి సామాన్య స్త్రీ కాదు. క్షాత్ర కులాలంకారమైన శ్రీరామచంద్రుని దేవేరి. జనకరాజు గారాబుకూతురు. దశరథ రాజేంద్రుని పెద్దకోడలు. రమాదేవితో సమానురాలైన ఈ రమణీ లలామను మీరందరు గౌరవాభిమానములతో కంటికి రెప్పవలె కనిపెట్టి ఉండండి"అన్న వాల్మీకి పలుకులు సీతాదేవి సౌభాగ్య సౌశీల్య సౌందర్య సంపన్నతలను కవి ధ్వనింపచేసినాడు.

ఈ విధముగా "సీతాదేవి వనవాస ఘట్టము"ను "ఉత్తర రామాయణ"మందు పాపరాజు కడు హృద్యముగా, కరుణరస సంభరితముగా దిద్ది తీర్చినాడు. సీతాదేవి, లక్ష్మణుల పాత్రలను మనోహరముగా పోషించినాడు. సంభాషణలు నాటకీయ శైలిలో సాగి, కవి నిరుపమాన శిల్ప చిత్రణమునకు నిదర్శనముగా నిలిచినవి.

సీతాదేవి సౌశీల్య సంపత్తులు భారతీయ వనితలెల్లరకు ఆదర్శముగా తీర్చిదిద్దబడినవి.

ఉత్తర రామాయణములో ఏ ఘట్టము చదివినను, వినినను కలుగు ఫలమును కవి కావ్యాంతమందిట్లు వివరించినాడు.

**అఖిల వేదంబులు పఠింపనగు ఫలంబు**
**నఖిల దానంబు లొనరింపనగు ఫలంబు**
**నఖిల తీర్థంబులను గ్రుంకనగు ఫలంబు**
**నొదవు నిక్కథ నొక్కింత చదివినంత.**

*(ఉ. రా. 8 ఆ. 340 ప.)*

వేదములు, సూర్యచంద్రులు, కుల పర్వతములు ఎంత కాలముండునో అంతవరకు ఉత్తర రామాయణ ప్రబంధము నిలిచి యుండునని కంకంటి పాపరాజు కంఠోక్తిగా పేర్కొనినాడు.

"కథాకథన కౌశలానికీ, సంభాషణ చాతుర్యానికీ, రసపోషణ నైపుణ్యానికీ, శైలీ నైగనిగ్యానికీ, అలంకార సమలంకరణానికీ, వర్ణనా వైదగ్ధ్యానికీ, చమత్కార చారుత్వానికీ, నుడికారపు విన్నాణానికీ ఆటపట్టైన మధుర ప్రబంధము ఉత్తర రామాయణం"అని కరుణశ్రీ కవీంద్రుడు కంకంటి పాపరాజు కావ్యమును ప్రస్తుతించుట సమంజసముగా తోచును.



# 6. నాంచారు పరిణయము-యక్షగాన వైశిష్ట్యము

ఆంధ్ర సాహిత్య చరిత్రలో దక్షిణాంధ్రయుగ సాహిత్యము నకొక విశిష్టమైన స్థానము కలదు. ప్రజానురంజకములైన యక్షగానములు, శృంగార ప్రబంధములు, మంజరులు, ద్విపద కావ్యములు, వచన కావ్యములు-మొదలైన బహువిధ ప్రక్రియా వైవిధ్యము, కళావతుల కవితాకేళీ విన్యాసము, రసికశేఖరులైన రాజకవుల పరంపర, లలితకళా ఫలభూములైన వారి ఆస్థానములు-దక్షిణాంధ్ర యుగ సాహిత్యమందలి విశిష్టతలు.

యక్షగానము దేశిరచనకు సంబంధించిన కవితాప్రక్రియ. జనసామాన్యమునకు ప్రదర్శన యోగ్యములగుటచే రాజులు, వారి ఆస్థానమందలి కవులు, కవయిత్రులు రమణీయమైన పెక్కు యక్షగానములు రచించి, ఆంధ్ర కవితా సుందరి నర్చించిరి. తంజావూరు పాలకుడైన విజయరాఘవ నాయకుడు విప్రనారాయణ చరిత్ర, ఉషా పరిణయము, జానకీ కల్యాణము మొదలైన యక్షగానములను, రంగాజమ్మ "మన్నారుదాస విలాసము"వంటి యక్షగానములను రచించెను. తరువాత పెక్కుమంది కవివరులు పుంఖానుపుంఖములుగా యక్షగానములు రచించినారు.

1731-1767 ప్రాంతమునకు చెందిన కవి నందవర భాస్కర శేషాచలామాత్యుడు "నాంచారు పరిణయము"అను యక్షగానమును రచించెను.

సుప్రసిద్ధ విమర్శకులు, మహాకవులు శ్రీ నిడదవోలు వేంకటరావుగారు, సమగ్రాంధ్ర సాహిత్య నిర్మాతలు శ్రీ ఆరుద్రగారు నష్ట

గ్రంథములుగా భావించిన "నాంచారు పరిణయము", "కూరత్తాళ్వారు చరిత్ర"అను రెండు యక్షగానములను తమిళనాడులోని రాజపాళయము తెలుగు విశ్వవిద్యాలయమువారు 1987లో ప్రచురించి, తెలుగు సాహితీ లోకమునకు మహోపకారము సలిపినారు.

'నాంచారు పరిణయము' యక్షగాన విశేషములను వివరించుటకు ముందు, యక్షగాన స్వరూపస్వభావములను తెలియజేయుట అసందర్భము కాదు.

యక్షగానము ఒక విధమగు రూపకము. ఇందు గీతము, నృత్యము, అభినయాదులు మిళితమై యుండును. గీతము - సంగీతమును, నృత్యము-లయను, అభినయము-భావ చేష్టాదులను ఆశ్రయించి యుండును. తొలుత పదములు, కందార్థములు లోనగు వానితో యక్షగానము ప్రారంభింపబడి, వీథి నాటకములు, భాగవతములను పేరుతో చాలకాలము ప్రదర్శింపబడినవి. తరువాత దరువు, ద్విపద, సీసములు, ఏలలు, జోలపాటలు, ధవళ భోజనములు, లాలిపాటలు, అల్లోనేరేళ్ళు, సువ్విపాటలు, హారతి పాటలు మొదలగునవి యక్షగానములందు కూర్చబడినవి. యక్షగానము బహువిధ పదకవితా సమీకరణము.

భరత మునీంద్రుడు దేవలోకములో నాటకాభినయ ప్రదర్శనము యక్షుల సాయమున చేయించుటచేనివి యక్షగానములైన వందురు. శ్రీనాథుడు వీనిని గూర్చి "కీర్తింతు రెవ్వాని కీర్తి గంధర్వులు గాంధర్వమున యక్షగాన సరణి"అని చెప్పుటచే, శ్రీనాథునకు ముందునుండియే యక్షగానములున్నట్లు తెలియుచున్నవి.

"యక్షగానము అనగా ఆ కాలములోని జక్కుల పాటలే అనియు, ఆకాలమందు పర్వదినములలో సంతాన కాంక్షులగు శ్రీమంతులు శుభార్థులై జక్కులను పిలిపించి, వారిచేత పాటలు

పాడించు ఆచారముండెనని తెలియుచున్నది"అని శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు తెలిపిరి.

*(ఆంధ్రపత్రిక-దుర్మతి సంవత్సరాది సంచిక 1921)*

'జక్కుల జాతి'ఒకప్పుడు యక్షగాన ప్రదర్శనమును ప్రధాన వృత్తిగా అవలంబించియుండిరి.

పండిత పామర వాఙ్మయ ప్రక్రియలకు, తత్త్వములకు సామరస్యము సాధించినది యక్షగానము. జాతీయ జీవితమును, సాంఘికాచార వ్యవహారాదులను ప్రతిబింబితము చేయుటలో పద్యకావ్యములకన్న, యక్షగానములదే పైచేయి. తెలుగులో పూర్వనాటక స్వరూపము యక్షగానము.

శేషాచల కవి విరచిత 'నాంచారు పరిణయము' యక్షగానము ధారాశుద్ధి కలిగిన సొంపైన రచనయనుటలో సందియములేదు. ఇందలి పద్యములు, పదములు మధురాతి మధురములై అలరారినవి. 'నాంచారు పరిణయము' యక్షగానములో గోదాదేవి చరిత్ర సంక్షిప్తముగను, గోదాదేవి కల్యాణ వృత్తాంతము అత్యంత విపులముగను వివరింపబడినవి.

నాంచారు (అండాళ్) పుట్టినది శ్రీవిల్లిపుత్తూరులో- తమిళ ములో ఆమెను నాచ్చియార్, చూడి కొడుత్తవళ్ (ఆముక్త మాల్యద), అండాళ్, కోదై (గోదాదేవి) అని వ్యవహరించెదరు. ఈమె పన్నిద్దఱు ఆళ్వారులందు ఏకైక స్త్రీమణి. ఈమె పెరియాళ్వారు (విష్ణుచిత్తుడు) పెంపుడు కూతురు. పెరియాళ్వారు, నాంచారు మంచి కవులు. వీరి వైష్ణవ గీతములైన 'పాశురములు' 'దివ్య ప్రబంధము'న తేజో మయముగా అలరారుచున్నవి. నాంచారు పాడిన 'తిరుప్పావై'

విశ్వవిఖ్యాతినందినది. ఉత్తమ కవయిత్రియైన 'నాంచారు'ఆంధ్రుల మన్ననకు పాత్రమైనది. తమిళ సాహిత్యముకన్నను, తెలుగు సాహిత్యమందు ఈమె ఎక్కువగా గౌరవింపబడి ఈమె చరిత్ర కావ్యములుగను, యక్షగానములుగను వెలసినవి.

శేషాచల కవి రామభక్తుడు. అందువలననే యక్షగానము ప్రారంభమునందే కవి 'శ్రీరామస్తుతి' చేసినాడు.

*శ్రీరాముడు బుధజన మం*
*దారుడు, మహనీయ కీర్తిధాముడు, జగదా*
*ధారుడు, సర్వాభీష్టము*
*లారూఢిగ మాకు నొసగు నధికప్రీతిన్* (నాంచారు ప. 1 పు.)

"సమస్త లోకములకు ఆధారభూతుడైన శ్రీరామచంద్రుడు సర్వాభీష్టములు ప్రసాదించుగాక"యని కవి 'రామస్తుతి'లోని భావము. కృతి రచనాపరుడగు శ్రీమన్నారు దేవుని ప్రార్థించి, తదుపరి శేషాచల కవి దశావతార వర్ణనము కావించినాడు.

మీనమై జలరాశిలోపల మేటి సోమకు గొట్టి వేదము
పూని యజునకు నొసగినట్టి సుపూజ్యు గొలుతున్
కమఠ రూపము దాల్చి దివిజుల కమృతమునకై మందరాచల
మమర వెత్తిన దేవదేవుని యాశ్రయింతున్
వంది రూపంబెత్తి మేదినిక్రిందు జేసిన హేమకశిపుని
మ్రంద గూల్చిన దివిజముని జనమాన్యునెంతున్.

... ... ... ... ... ...

బుద్ధరూపంబున దురాత్ముల పొలయజేసి సమస్త సురముని
సిద్ధసాధ్యుల బ్రోచి గాచు ప్రసిద్ధిగాంతున్
కలికియై మ్లేచ్ఛులను యమపురికనిపి యఘముల బాపి జగముల
వెలయుజేసిన వేదవేద్యుని విబుధు గొలుతున్"

(నాంచారు ప.2పు.)

అలతి అలతి పదముల పొందికతో శేషాచల కవి గావించిన "దశావతార వర్ణనము" మనోహరమై భాసించినది.

వాణిని నుత గీర్వాణుని గొలుతున్
కమలాలయ యను కమల భజింతున్
భవుని దేవియగు పార్వతినెంతున్
సకల దేవతల సన్నుతి సేతున్ (నాంచారు ప. 3 పు.)

త్రిమూర్తుల భార్యలైన లక్ష్మి, సరస్వతి, పార్వతి దేవతలను, సమస్త దేవతలను సన్నుతి గావించినాడు. రాతిని నాతిగా చేసినట్టి శ్రీరామచంద్రునకు కవి తన యక్షగానమును అంకితమిచ్చినాడు.

శేషాచల కవి 'నాంచారు పరిణయ' యక్షగాన ప్రారంభములో, ప్రబంధ సంప్రదాయముననుసరించి శ్రీ విల్లిబూత్తురు వర్ణనము చేసినాడు. దేశీయ ఛందమైన ద్విపదలో పురవర్ణనము చేయుట ఈ యక్షగాన ప్రత్యేకత.

శ్రీ వెలయుచునుండు శృంగారముగను
శ్రీవిల్లిపుత్తూరు చెలగు భూస్థలిని
మేరు మందరముల మించి యున్నతపు
చారు గోపురములు సోపానములును
మణికుట్టిమంబులు మణికవాటములు
మణులచే విలసిల్లు మందిరంబులును
రాజహంసములచే రమణీయమైన
రాజిల్లు సోపాన రాజిచే మెఱయు
కమలాకరంబులు కమల సంతతుల
ప్రముదిత మధుకరభ్రమణముల్ చెలగ
చెరుకుతోట లనంట్లు శృంగారవనము
పరిమళమిళితమై భాసిల్లుచుండు. (నాంచారు ప. 3, 4 పు.)

మేరు పర్వతములను మించిన ఎత్తైన గోపురములతోను, మణులతో విలసిల్లు మందిరములతోను, రాజహంసలచే రమణీయమైన సరస్సులతోను, కమలములతోను, తుమ్మెదల నాదములతోను, అరటి, చెఱకు తోటలతోను, ఉన్నత సౌధములతోను, విపణి వీథులతోను, చతురంగ సేనలతోను, వేదశాస్త్ర పురాణవేత్తలతోను, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులతోను, ధనదాన సమృద్ధితోను అలకాపురమనునట్లు శ్రీవిల్లిబుత్తూరు విరాజిల్లుచున్నదట! సరళసుందరమైన పదముల పొందికతో, దేశీయ ఛందమైన ద్విపదలతో శేషాచలకవి 'శ్రీవిల్లిబుత్తూరు'ను అత్యంత రమణీయముగా అభివర్ణించినాడు.

శ్రీకృష్ణదేవరాయులు గోదాదేవి కథతో కూడిన ''ఆముక్తమాల్యద''లో 'శ్రీవిల్లిబుత్తూరు'ను ఇరువదియైదు పద్యములలో, సంస్కృతసమాస భూయిష్ఠముగా వర్ణించినాడు. మచ్చునకొకటి -

*"లలితోద్యాన పరంపరా పిక శుకాలాప ప్రతిధ్వానముల్*
*వలభీనీల హరిన్మణీపిక శుకస్వాన భ్రమంబూన్పమి*
*న్నులతో రాయు సువర్ణ సౌధముల నెందుం జూడ చెన్నొంది శ్రీ*
*విలుబూత్తూరు వెలుంగు బాండ్యనగరోర్వీరత్న సీమంతమై"*

*(ఆ. మా. 1 ఆ. 51 ప.)*

''ప్రబంధము వర్ణనా ప్రధానము''గనుక, రాయలు 25 పద్యములతోను, సంస్కృత పదపోహళింపుతోను రచించుట సమంజసముగా తోచును- "నాంచారు పరిణయము" యక్షగానమగుటచే శేషాచలకవి తెలుగు ఛందములో లలిత సుకుమారమైన పదజాలముతో పురవర్ణనగావించి, పండిత పామరులను రంజింపచేసినాడు.

విష్ణుచిత్తుడు అనుదినము త్రివేణిలో స్నానము చేయుచు, హోమములు గావించి, సంపంగి వనములోని ఫలములను టపత్రశయనునకు భక్తితో సమర్పించెడివాడు; ఆ వనమందలి రకముల పువ్వులను దండలుగా కట్టి శ్రీహరిని అత్యంత శ్రద్ధలతో పూజించెడివాడు.

ఒక శుభదినమున విష్ణుచిత్తునకు అదృష్టవశమున ఆ దనవనములో ఒక బాలిక దొరికినది.

అలరుల నందనవనంబున
అలరారుచు నొక్క కన్య యావిర్భవమై
అల సీత మున్ను భూమిని
చెలువుగ నుదయించినట్లు శ్రీయొప్పారెన్

(నాంచారు ప. 9 పు.)

ఆ బాలికయే నాంచారు - గోదాదేవి. గోదాదేవిని కవి సీతా దితో పోల్చి వర్ణించుట ఎంతయో సమంజసమై భాసించును.

"అఖిల జగన్మాతయైన శ్రీలక్ష్మి
అఖిలంబు రక్షింప నవనిలోపలను
ఉదయించు డెఱుగక నొగి కూతురనుచు" (నాంచారు ప. 9 పు.)

ఆ బాలికను ఆ బ్రాహ్మణ దంపతులు అత్యంత అనురాగముతో ంచుచుండిరి.

'నాంచారు పరిణయము' యక్షగానములో లాలిపాటలు, లపాటలు, అర్ధచంద్రికలు, ఏలలు - ఇత్యాది జానపదగేయ రీతు ను శేషాచల కవి సందర్భోచితముగా, సరస భావ సముపేతముగా నుగు నుడికారపు సొంపులతో పాఠకుల మనస్సులకు సంతోష రవశ్యము కలుగునట్లు రచించుట విశేషము.

'నాంచారు పరిణయము' యక్షగానములో ముత్తైదువలు బాల నాంచారమ్మకు పాడిన లాలిపాట సహృదయాహ్లాదము కలిగించును.

## లాలిపాట

లాలియని పాడరే లలన లిరుగడలా
బాల నాంచారమ్మ పవ్వళించినది
శ్రీరాజితంబైన శృంగార తొట్ల
యీరేడు భువనముల కిరవైన తొట్ల
భూరి రత్నోజ్వల స్ఫురితమగు తొట్ల
శ్రీ రమాదేవిచే చెలువారు తొట్ల ॥ లాలి ॥

నలు దిక్కులను భూషణ ప్రభలు వెలుగ
కలయ ముక్తాహారములు చిక్కుపడగ
ఘలుఘల్లుమనుచు కంకణము లెసంగ
లలితకరములబట్టి లాలిపాడుచును ॥లాలి॥ (నాంచారు ప. 11 పు.)

బాల నాంచారమ్మకు భూసురవనితలు పాడిన జోలపాట

## జోలపాట

జోజో॥ జోజో మహాలక్ష్మీ జో జగన్మాతా
జో జగన్నుతశీల జో చిన్నిబాలా ॥ జోజో ॥
కలయ బ్రహ్మాండంబు కడుపులో నునిచి
నలువనాభిపుటంబునను వసింపగను
చెలగి క్షీరాబ్ధిపై శయనించియున్న
నలినాక్షు యురముననను చెలువమరు బాలా ॥ జోజో ॥
పాల కడలికి కూర్మిబాలయైనట్టి
శ్రీలక్ష్మి వేడ్కమై లీలార్థముగను
భూలోకమున పుట్టి బృందావనమున
బాలయై మెఱయుచును ప్రభవించు తల్లి ॥ జోజో ॥

(నాంచారు ప. 11 పు.

తెలుగింటి స్త్రీలు తమ పిల్లలను లాలించి - లాలిపాటలు పాడుటయు, బుజ్జగించి, జోకొట్టి నిద్రపోవుటకై జోలపాటలు పాడుటయు అనుదినము మన ఇండ్లలో చూచుచునే యున్నాము. అడుగడునను జాతీయ భావము, తెలుగుదనమును ఉట్టిపడు యక్షగానము "నాంచారు పరిణయము".

నాంచారు బాల్యక్రీడలను కవి 'అర్ధచంద్రిక'లలో అందముగా అభివర్ణించినాడు.

**తోడి చేడియలతో నాట్లాడున్**
**బొమ్మల పెండ్లిండ్లిమ్ముగ జేయున్**
**చిలుకకు పద్యము చెప్పదొడంగున్**
**పువ్వుల సరములు పొందుగ గట్టున్**
**బంగరుయ్యేలల బాగుగ నూగున్**
**పడతుల గూడుక బంతుల నాడున్**
**తీరుగ నుదుటను తిలకము దిద్దున్**
**కస్తురి మృగమద గంధమలందున్**
**ముత్యపు సరులురమున ధరియించున్**
**కురులను పువ్వుల సరముల దురుమున్.**

*(నాంచారు ప. 12 పు.)*

ఇవన్నియు మన ఇండ్లలో ప్రతిరోజు పసిపిల్లలు ఆడు ఆటలే! శేషాచలకవి లోక పరిశీలనాసక్తిని, మృదుమధుర కవితాశక్తిని నిరూపించుచున్నవి.

'నాంచారు పరిణయము' యక్షగానములో కవి విష్ణుచిత్తుడు, గోదాదేవి, శ్రీరంగనాథుని పాత్రలను అద్భుతముగా చిత్రించినాడు. వేదవిదుడు, విలసిత షట్ఛాస్త్ర విజ్ఞానపరుడు, విమల మానసుడు, నిత్యశుద్ధాచార నిపుణుడు, సంతత అన్నదానవ్రతుడు, దాంతుడు,

అత్యుదారుడు, విష్ణుసమానుడు-విష్ణుచిత్తుడు. నిరంతరము వటపత్త్రశయనుని సేవించి, తరించిన ధన్యుడు విష్ణుచిత్తుడు. ఆతని కూతురు నాంచారు సాక్షాత్తు శ్రీమహాలక్ష్మియే. నాంచారు ధరించి విడిచిన పూలమాలలను ఆమె తండ్రి భగవంతునికి సమర్పించి ధన్యుడైనాడు.

నాంచారు రూపసౌందర్యాతిశయమును కవి పరమ రమణీయముగా అభివర్ణించినాడు.

జంపె. "యీ యింతి చక్కదనమెందు చూచినగాన
మో యన్నలార యీ యుర్వి లోపలను
మరువంపు రెమ్మయో మరుచిక్కటారియో
మెరుపుతీగయొ కొమ్మ మెరుగుజిగిమేనొ
చంద్రబింబము బోలు సఖియ నును నెమ్మోము
యింద్రనీలము గేరు యింతి ముంగురులు
యిందుధరురాణియో యిందిరాదేవియో
యెందు జూచిన గాన మీ వైభవంబు
శ్రీమహాలక్ష్మియవని నిల్పుటకునై
భూమిలోపల వచ్చి పుట్టెకాబోలు"*(నాంచారు ప.16 పు.)*

నాంచారు శరీరావయములను ప్రసిద్ధ ఉపమానములతో పోల్చి ప్రబంధ కవుల నాయికా సౌందర్యవర్ణనమున కేమాత్రము తీసిపోకుండునట్లు అభివర్ణించుట ఈ యక్షగాన విశేషములలో నొకటి.

శ్రీరంగనాథుని రూపగుణ వర్ణనము కవి పరమాద్భుతముగా వర్ణించినాడు.

"సకల లోకములకు శరణ్యుడైనవాడు
ప్రకటముగ లోకములు పాలించువాడు
నవ పద్మలోచనుడు నాగేంద్రశయనుండు
రవికోటి నిభతేజు రాజవదనుండు

సుజనరక్షకుడు కౌస్తుభ రత్నభూషణుండు
సజల జలదనీలశ్యామలతనుడు
యేడు కోటలలోన వేడుకలతో నుండు
యీడుజోడు లేదాతనికి యెంతో చక్కనివాడు
శ్రీరంగనాథుడే చెలియనీకు పతియగును.
కోరికలు సమకూరు కోమలి యింకను
వాలాయముగ నిన్ను వలచియున్నాడు
వాలుగంటి నీ చిత్తమువాని తగిలియున్నది"

(నాంచారు ప. పు 19)

శ్రీరంగనాథుడు సాక్షాత్తు శ్రీమహావిష్ణువు. ఉభయ కావేరి నడుమ శ్రీరంగపట్టణములో భక్తులను రక్షించుటకు శ్రీరంగనాథునిగా భువిపై అవతరించినాడు. అట్టి శ్రీరంగనాథుడు నాంచారును వలచియున్నాడనియు, ఆమె చిత్తము వానియందు తగిలియున్న దనియు ఒక 'యెరుకల కాంబోది' జోస్యము చెప్పినది. దక్షిణాంధ్ర యుగ మందలి యక్షగానములలో అటనట 'ఎరుకత' పాత్రలు మనకు దర్శనమిచ్చును.

'నాంచారు పరిణయము' యక్షగానమందలి మరొక ముఖ్య విశేషము - నాంచారు శ్రీరంగనాథుల పరిణయ ఘట్టమందు మంగళహారతి పాటలు, నలుగు పాటలు, బువ్వబంతుల పాటలు, ధవళములు, సువ్వి సువ్వి పాటలు, అల్లోనేరేళ్ళు, శోభనపు పాటలు, అప్పగింతల పాటలు, చక్కని చిక్కని తేట తెనుగు పదముల పొందికతోకూడి కవి కమనీయ కవితా ధారను నిరూపించుచున్నవి. సంగీత సాహిత్య నృత్యభరితమైనది ఈ యక్షగానము.

నాంచారు శ్రీరంగనాథుల వివాహ సన్నివేశములు మన భారతీయ కళ్యాణ సంస్కృతికి అద్దము పట్టుచున్నవి. వధూవరులచే

8

మంగళ స్నానములు చేయించుట-వధువు నాంచారును విష్ణుచిత్తుడు తన భార్యతో కూడి, వరుడు శ్రీరంగనాథునకు కాళ్ళు కడిగి కన్యాదానము కావించుట - మంగళసూత్రధారణము - తలంబ్రాలు - వధూవరుల కొంగుముళ్ళు వేయుట (బ్రహ్మముళ్ళు వేయుట)- సప్తపది-లాజహోమము-వధూవరులు హవ్యవాహనునకు ప్రదక్షిణము చేయుట - ముత్తైదువులు మంగళహారతులు పాడుట - వధూవరులచే తలుపుదగ్గర ఒకరిపేరు మరొకరిచే చెప్పించుట- స్థాలిపాక హోమము చేయుట - బువ్వబంతి - నాగవల్లి - దంపతులకు తాంబూలాలిప్పించుట - వధూవరులను ఊరేగించుట-అప్పగింతలు మొదలైన ఈ యక్షగానమందలి అంశములన్నియు మన భారతీయ కుటుంబములలో జరుగు వివాహ వ్యవస్థకు, సంప్రదాయ రీతులకు అచ్చపు దర్పణమని చెప్పవచ్చును.

వధువు నాంచారును అభ్యంగన స్నానము చేయించి, కొందరు యువతులు ధాన్యము దంచుచు సువ్విపాటలు, అల్లోనేరేళ్ళు పాడినారు.

**సువ్విపాటలు :**

సువ్వి సువ్వి సువ్వాలె

సువ్వి విష్ణుచిత్తుసుతకు సువ్వి సర్వలోకనుతకు

సువ్వి విశదసూక్ష్మమతికి సుగుణమతికి ॥ సువ్వి ॥

కొంచమైన కుందనంపు కుంద నమరగాను వుంచి

చంచలాక్షులపుడు గూడి సంతసంబున ॥ సువ్వి ॥

విరులసరులు గొప్ప ముత్యసరు లురమున చిక్కుపడగ

కరములందు అయలీయకములు వెలుగగా ॥సువ్వి॥

### అల్లో నేరేళ్ళు :

అల్లో నేరేడల్లో నాచ్చారు పరిణయము నాగరికమాయె ॥అల్లో ॥
శ్రీవిల్లిపుత్తూర వెలగి వేడుకల
దేవాదిదేవులకు దేవియై మిగుల
భావమున చెలువొంది భాసిల్లె బాలా
దేవి నాంచారమ్మ ఠీవిచే చాలా ॥అల్లో॥
ధరణిలో బుట్టి బృందావనంబునను
ధరణిసురు కూతురై దనరి వేడుకను
ధరణి రక్షింప శ్రీధరుని పెండ్లాడి
ధరలోని ప్రజలెల్ల దన్నుకీర్తింప ॥అల్లో॥

విష్ణుచిత్తుని దంపతులు, వరుడు శ్రీమన్నారుదేవుని కాళ్లుకడిగి కన్యాదానము చేయు ఘట్టమును, వరుడు వధువు మెడలో మంగళ సూత్రధారణము చేయు సన్నివేశమును హృద్యములై అలరారినవి.

### మంగళసూత్రధారణము :

కలకంఠి యపుడు జలములు స్వర్ణపాత్రచే
చెలువొప్ప శ్రీవిష్ణుచిత్తు చేనొసంగెన్
ధారవోసెను త్రిజగదాధారుండగు హరికి
మారుగన్నట్టి శ్రీమన్నారునకును
అలరు మంగళసూత్రమపుడు మధుసూదనుడు
చెలువ కంఠమునందు చెలువమరనుంచెన్.

(నాంచారు ప. 37 పు.)

## తలంబ్రాలు :

మంగళసూత్రధారణము తరువాతి సన్నివేశము తలంబ్రాలు. కవి మధుర మనోజ్ఞముగా వర్ణించినాడు.

"అపుడు విరులును ముత్యములు బ్రాలమర బంగరు తట్టలందును
కపురగంధులు కరములనునిడి కదిసి నిలువన్
అంత నాంచారమ్మ యుత్కంఠాస్యయై ప్రియుమౌళియందును
పంతమలరగ నిక్కితగ తలబ్రాలు పోసెన్
యెంతయును కడువేడ్క నవ్వొలయగ శ్రీమన్నారు విభుడును
యింతికిని తలబ్రాలు పోసెను యింపుతోడన్"

(నాంచారు ప. 38 ప.)

నాంచారు-శ్రీరంగనాథుల పరిణయవేళ ముత్తైదువులు ధవళములు పాడిరి. ధవళము దేశీయ రచన - గీత ప్రధానము.

## ధవళము

జయ జయ సుగుణాలవాలా
జయ జయ దశవిధ లీలా
జయ జయ హాటక చేలా
జయ జయ రాజగోపాలా (నాంచారు ప. 38 పు.)

విప్రభార్యలు వధూవరులకు హారతులిచ్చి పాటలు పాడి ఆశీర్వదించిరి.

## హారతిపాటలు :

మంగళం మౌనినుత మండితపదాబ్జునకు
మంగళం త్రైలోక్య మందిరునకు
మంగళం శతకోటి మార్తాండ తేజునకు
మంగళం శ్రీరంగమన్నారుకును ॥జయమంగళం
శుభమంగళం ॥

దక్షునకు భువన సంరక్షునకు
దీక్షిత విచక్షునకు శిక్షితవిపక్షునకును
పక్షివాహనునకు శుభలక్షణున
కనిమిషాధ్యక్షునకు వికచకమలాక్షునకు
॥జయ మంగళం॥
(నాంచారు ప. 41 పు.)

మంగళహారతుల పాటలలో సహితము శేషాచల కవి అనుప్రాసాది శబ్దాలంకార విన్యాసమును ప్రయోగించి, శ్రుతి పేయముగా పదముల పొందికను కూర్చి, అక్షర రమ్యతను సాధించుట "నాంచారు పరిణయ" యక్షగానమందలి ప్రత్యేకతగా చెప్పవచ్చును.

**బువ్వబంతులు :**

నాంచారు శ్రీరంగనాథుల పెండ్లి సందర్భమందు కవి బువ్వబంతులను విపులముగా వివరించినాడు.

యన్నరాసులు సూపమాదిగా గల్గు
బహువిధ పరిపక్వ భరితశాకముల
బహుళమై రుచులచే పరగు పచ్చళ్ళు
పరమాన్నములును యప్పడములు శిఖర
లరుదార రుచికరమగు నూరిబిండ్లు
అతిరసంబులు మనోహరము లిడ్డెనలు
వెలలేని ఆజ్య సుభిక్ష భక్ష్యములు
కదలీఫలంబులు ఖర్జూరములును (నాంచారు ప. 43 పు.)

ఆనాటి శాకపాకములను భక్ష్యభోజ్యములతో కూడిన "బువ్వబంతు"లను కవి కమనీయముగా వర్ణించినాడు.

"నాంచారు పరిణయము" యక్షగానమందలి ఘట్టములన్నింటిలో "అప్పగింతలు" సన్నివేశము నీతిబో కరుణ రసాత్మకమై పాఠకుల కన్నులవెంట నీరు పెట్టించున

**అప్పగింతలు :**

త్రిభువనములను సతికి పతియే దైవమనుచును చెప్ప వినవ
సభయభక్తిని చెప్పు పనులను సలుపవమ్మా
పతియె ప్రాణము పతియె చుట్టము పతియె బంధుడు సతు
పతిగుణంబునకనువుగా తుది పరగవలయున్
కోపగించిన వేసరించిన కొదవచెప్పిన యోర్పుగలుగుచు
కాపురము సేయంగవలయును కాంతలకును
క్షమయె దానము క్షమయె ధర్మము క్షమయె సత్యము క్షమయె
క్షమయె కావలె సంతతంబును సతులకెల్లను
అత్తమామల కాడుబిడ్డల కఖిలబంధు సమూహములకును
చిత్తము రానడుచుకొనవలె చేడియలకున్
వ్రతములు వుద్యాపనలు వుపవాసములు దానములు ధ
పతి యనుజ్ఞను నడుపవలయును పతివ్రతలకున్

(నాంచారు ప.

తల్లిదండ్రులు తమ కూతురును అత్తవారింటికి పంప ఎవరితో ఎట్లు మెలగవలయునో బుద్ధులు చెప్పి పంపుట భారతీయుల కుటుంబములలో వివాహ సందర్భమున సన్నివేశములే! ఈ "అప్పగింతల" సన్నివేశమంతయు మన క కట్టునట్లు శేషాచలకవి తన యక్షగానములో అభివర్ణించినాడు సినలైన భారతీయ సంప్రదాయములను ప్రతిబిం యక్షగానము శేషాచల కవి "నాంచారు పరిణయము."

**శోభానె - శోభనమె :**

రామునకు సురుచిరగుణధామునకు
　　ప్రాభవమలదిన మారంగమన్నారునకు ॥శోభానె॥
శ్రీమించు దశరథభూమీశునకు పుట్టి
　　రాముడన జగదభినవధాముడైన హరికి
తాటకిని పరిమార్చి ధరణి రక్షించిన
　　మేటియగు శ్రీరామమేదినీశునకు
కౌశికుని యాగంబు ఘనతమీరగగాచి
　　భాసిల్లుచు మారీచసుబాహులకూల్చిన హరికి
జనకుని యజ్ఞము చూడజని శివుని విలువిరిచి
　　జనకజ పెండ్లాడిన జలజాతాక్షునకు ॥శోభానె॥

అను మంగళగీతముతో శేషాచల కవి రచించిన "నాంచారు పరిణయ" యక్షగానము పరిసమాప్తమగును. "శ్రీరామస్తుతి"తో ప్రారంభమైన ఈయక్షగానము "శ్రీరామకథావైభవము"తో ముగియుట విశేషము.

భారతీయుల కల్యాణ సంస్కృతీ సంప్రదాయములను వివిధ జానపద గేయరీతులలో సరళసుందరమైన పదముల పొందికతో - ఏలలు, జోలలు, లాలిపాటలు, ధవళములు, అల్లోనేరేళ్ళు, సువ్వి పాటలు మొదలైన దేశీయ రచనలతోను, ద్విపదలు, సీసములు, తేటగీతులు, కందములు, త్రిపుదలతోను శేషాచలకవి రచించిన "నాంచారు పరిణయు" యక్షగానము విలక్షణమై, విశిష్టమై పండితపామర రంజకమై అలరారినది.



# ఉపయుక్త గ్రంథములు


1. ఆంధ్రపత్రిక - దుర్మతి సంవత్సరాది సంచిక-1921
2. ఆంధ్ర మహాభారతము-ఆది సభాపర్వములు-నన్నయ
   తెలుగు విశ్వవిద్యాలయము, హైదరాబాదు.
3. ఆంధ్ర మహాభారతము-అరణ్య పర్వము-ఎఱ్ఱన ,,
4. ఆంధ్ర మహాభారతము-ఔపదేశిక ప్రతిపత్తి
   - డా॥ నందుల గోపాలకృష్ణమూర్తి
5. ఆంధ్ర మహాభాగవతము-పోతన
   -తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్.
6. ఉత్తర రామాయణము-కంకంటి పాపరాజు
   -ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్.
7. కంకంటి కవితా వైభవము-కరుణశ్రీ -యువభారతి-సికింద్రాబాదు
8. నాంచారు పరిణయము-శేషాచలకవి
   -రాజపాళెయం తెలుగు విద్యాలయం, తమిళనాడు.
9. మందార మకరందాలు-డా॥ సి. నారాయణరెడ్డి
   -యువభారతి, సికింద్రాబాదు.
10. మహాభారత విమర్శనము-శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు.
11. శ్రీకాళహస్తి మాహాత్మ్యము-ధూర్జటి -ఎమెస్కో సంప్రదాయ సాహితి.
12. యక్షగాన వాఙ్మయ చరిత్ర-ఆచార్య యస్వీ. జోగారావు.